తొలి కూర్పు
ప్రతులు 2000

డిసెంబరు
1980

# ప్రవేశ పరీక్ష పాఠ్యాంశము

వెల : రు. 2-50

# ఇందులో

# హైస్కూలులో

వివాహకాలమున నేను హైస్కూలులో చదువుకొనుచుంటినని లోగడనే వ్రాసియుంటిని. మేము మూవురు సోదరులము. ఒక పాఠశాల యందే చదువుచుంటిమి. జ్యేష్ఠునిది చాల పయితరగతి. నాతోపాటు పెండ్లి అయిన రెండవ సోదరుడు నా పయితరగతిలో ఉండెను. మాకు ఒకయేడు వివాహముతో విద్యానాశమాయెను. ఈ నా అన్నపని మరీ అన్యాయము. ఆయన బడి మానెను. ఎందరు పిన్నవాండ్రు ఇట్టి అవస్థకు పాలుపడిరో దైవమునకే ఎరుక! నేటి మన హిందూసంసారములందు మాత్రము విద్యా వివాహములు రెండును సమముగా నడచును.

నా చదువు ఎడతెగక సాగుచుండెను. హైస్కూలున నాకు మొద్దబ్బాయి అని గణన లేదు. నాయెడ ఉపాధ్యాయులకు వాత్సల్యము. కుఱ్ఱని నడవడిగూర్చియు, విద్యనుగూర్చియు తలిదండ్రులకు ప్రతి యేడును ఉల్లాకు (certificate) పంపుచుండుట మామూలు. నాకు ఎపుడును చెడ్డ సర్టిఫికెట్ లేదు. అది యటుండ, నేను రెండవ తరగతి గెలుపొందిన పిదప బహుమతులుకూడ సంపాదించితిని. నెల ౧ కి అయిదవ తరగతిలో నాలుగును, ఆఱవ తరగతిలో పదియును రూపాయలు విద్యార్థి వేతనము వడసితిని. ఇది కేవలము నా ప్రజ్ఞవలన గాదు; మరి అదృష్టమువలన. ఏలన, ఈ వేతనములు అందరకు కావు; అవి కేవలము కాఠియావాడులోని సోరఠు డివిజనునుండి వచ్చువారిలో శ్రేష్ఠులకుమాత్రము, మరియు నలువండ్రు, ఏబండ్రు కల తరగతిలో సోరఠునుండి వచ్చు కుఱ్ఱలును ఎక్కుడుమంది ఉండువారు కారు.

నా తెలివితేటల విషయమై నాకు తృప్తి ఉన్నటులు గురుతు లేదు. బహుమతులుగాని, వేతనముగాని లభించినపుడు ఆశ్చర్యము కలిగెడిది. కాని ప్రవర్తనమును కడు మెలకువతో కాపాడుకొనుచుండు వాడను. నలుసంత దోసగు కానిపించిన కన్నుల జొటజొట నీరు ఉరలెడిది. దండ్యుడ నయినపుడుకాని, 'వీడు దండ్యుడు' అని గురువు అనుకొనినపుడుకాని నా చింతకు మేరలేదు. నేనొకతూరి దెబ్బలు తిన్నట్లు ఉన్నది. కొట్టిరని నేనంతగా వగవలేదు. కాని కొట్టదగిన నేరము చేసితినని అనుకొనిపోవుదురుగదా అని మిగుల వగచితిని; వెక్కి వెక్కి ఏడిచితిని. ఈ ముచ్చట నేను ఒకటవ తరగతిలో ఉండగనో, రెండవ తరగతిలో ఉండగనో. నేను ఏడవ తరగతిలో ఉండగా ఇట్టిదే మరియొకటి: అపుడు హెడ్‌మాస్టరు దొరాబ్జి ఎడుల్జీ గిమీ. అతడు శిష్య వత్సలుడు, నియమపాలకుడు, విధివర్తి, సుశిక్షకుడును. ఆయన పయి తరగతులలోని బాలురకు శరీర వ్యాయామము, క్రికెట్ వ్యాయామము తప్పనిసరిగా చేసెను. నాకు రెండును గిట్టనివి. ఈ నియమమునకు ముందు నేను క్రికెట్‌గాని, పుట్‌బాల్‌గాని మరియేదిగాని ఆడిన పాపమున పోలేదు. దానికి కారణము నేడు నాకు తప్పని తెలిసిన బిడియమే. శరీర వ్యాయామమునకు చదువుతో పొత్తులేదని నాడు నాకు దురూహ. విద్యా ప్రణాళికలో మనశ్శిక్షకు ఎంతతావు కలదో శరీర వ్యాయామమునకును అంతతావు ఉండవలయునని నాకు నేడు తెలియును.

వ్యాయామమును వీడినందువల్ల నాకు లోటులేదని చెప్పగలను. ఏలన, బయలున చాలదవ్వు నడచుట మంచిదని అచట నచట చదివి ఆ సలహాను గమనించి నేటికిని నేను అలవాటులో ఉంచుకొనిన నడకను అలవరిచికొంటిని. తిరుగుటకూడ నొకవిధమగు వ్యాయామమే కావున ఈ వ్యాయామముచే నాకు తగురీతి శరీరపాటవము కలిగెను.

మా తండ్రిగారికి పరిచర్య చేయవలయునను మిక్కుటమగు అభిలాషకూడ శరీర వ్యాయామమునెడ అనిష్టమునకు రెండవ కారణము. బడి వదలగనే ఇంటికి పరువిడి మా తండ్రి పరిచర్యలో లగ్నమయ్యెడివాడను. వ్యాయామ నియమము దీనికి అడ్డుతగిలెను. మా తండ్రిగారికి నేను పరిచర్య చేయవలయును కాన నాకు ఈ నియమము లేకుండ చేయుదని గిమీగారికి విన్నవించుకొంటిని. ఆయన నా మాట వినలేదు. ఆ రోజులలో శనివారమునాడు ప్రొద్దుటిపూట బడి. ఆ శనివారపు సాయంకాలమున నాలుగు గంటలకు వ్యాయామమునకై ఇంటినుండి బడికి పోవలసి వచ్చెను. నాకు గడియారము లేదు. ఆకసము మేఘావృతమై యుండెను. ఆ కారణమున నాకు ప్రొద్దు తెలియలేదు. మబ్బులు నన్ను మోసగించెను. నేను బడికి వెళ్లువరకు అచట ఒక పిట్టయేని లేదు. మరునాడు గిసీగారు హాజరుపట్టీ పరీక్షించుచు నన్ను జూచి నీ వేల నిన్న హాజరు కావైతివని అడిగిరి. నేను జరిగినది చెప్పితిని. ఆయన నా మాట నమ్మక అణాయో, రెండణాలో కాని (నా కిపుడు గురుతు లేదు) జరిమానా వేసెను.

నేను అబద్ధాలకోరనిపించుకొంటిని. ఇది నాకు ఎంతో వింత కలిగించెను. నేను టూటాకోరును కానని ఎటులు సమర్థించుకొనగలను? ఉపాయాంతరము లేదు. మనము రోషపూరితమయ్యెను. మిగుల దుఃఖించితిని. సత్యమును నమ్ముకొన్నవాడు ఎల్లపుడును జాగ్రత్తగా ఉండవలెనని నేను గమనించితిని. నా విద్యావ్యాసంగమధ్యమున బడిలో నేను అశ్రద్ధగా నుండుటకు ఇదియే ఆది; ఇదియే అంతమును. జరిమానా వేసిన సొమ్ము తిరిగి యిచ్చునటులు చేసికొనగలిగితినని నాకు కొంత గురుతు.

'బడి వదలగనే మా వాడు నాకడ ఉండవలసియున్నా'డని మా నాయనగారి కోరికమీద తుదకు నాకు వ్యాయామమునుండి విడుదల

కలిగినది. నేను వ్యాయామమును ఏమరుటచే కొరవడకున్నను మరియొక ఏమరికకు దండము లర్పించుకొనుచునే యున్నాను. 'దస్తూరి విద్యలో ఒక భాగము కాదు' అను ఈ దురుద్దేశము నాకు ఎటనుండి యొదవెనో తెలియదు కాని, ఇంగ్లాండు వెళ్లువరకు నిలువ ఉండెను. తరువాత తరువాత, ముఖ్యముగా దక్షిణాఫ్రికాలో అచట పుట్టి, అచట విద్యావంతులైన పిన్నవారలయు, లాయరులయు ముత్తియములబోలు చక్కని వ్రాతను చూచి సిగ్గిల్లి నేను దానిని ఏమఱినందులకు పశ్చాత్తాపపడితిని. చెడు దస్తూరిని అసమగ్రమగు విద్యయొక్క చిహ్నముగా పరిగణింపవచ్చునని నే నరసితిని. పిదప నేను వ్రాయసమునకు పాటుపడితిని గాని తరుణము తప్పెను. నా బాల్యమునందలి లోపమును నే నెన్నటికిని దిద్దుకొనలేకపోతిని. నన్ను చూచి ప్రతి చిన్నవాడును ప్రతి చిన్నదియు జాగ్రత్తపడుగాక ! మంచి దస్తూరి విద్యలో ఒక ముఖ్యాంశమని గుర్తించుగాక ! అక్షరముల దిద్దించుటకుముందు బాలురకు చిత్రలేఖనము నేర్పుట యుక్తతరమని నాకు నేడు తోచుచున్నది. పూవులు, పిట్టలు మొదలగువానిని పరికించి గీయునటులే అక్షరములనుగూడ పరికించి వ్రాయుట తగును. వస్తువులను చూచి వ్రాయుట నేర్చుకొన్న పిదపనే వ్రాత నేర్చుట తగును. అపుడు వరవడి అచ్చునుబోలి యుండును.

నాటి బడిమాటలు చెప్పదగినవి రెండు కలవు. వివాహముచే నాకు ఒకయేడు విద్యానాశము వాటిల్లినది. దానిని కూడదీయుటకు ఉపాధ్యాయుడు పయితరగతిలో ప్రవేశపెట్టించెను. కష్టించి వ్యాసంగము చేయువారికి సాధారణముగా ఈ వీలు ఉండెడిది. కాన నేను మూడవ తరగతిలో ఆఱునెలలే ఉండి వేసగి సెలవులకు ముందు జరుగు పరీక్షలు అగుపిదప నాలుగవ తరగతిలోనికి దాటింపబడితిని. నాల్గవ తరగతి మొదలుకొని చాల పాఠములు ఇంగ్లీషుననే బోధింపబడుచుండెను. నేను ఇంగ్లీషులో

లేశమైనను తెలిసికొనలేకుంటిని. క్షేత్ర రేఖా గణితములు నాల్గవ తరగతి లోనే ప్రారంభమగుచుండెను. వానిసంగతి బాగుగా నాకు తెలియదు. ఆంగ్లములో బోధించుటచే అది మరికొంచెము రాయి అయెను. క్షేత్ర గణితములో ఉపాధ్యాయుడు మంచిబోధకుడే కాని నాకుమాత్రము తెలిసి కొను శక్తి లేదు. పలుమారులు నిరాశచెంది రెండేండ్ల చదువు ఒకయేడు మింగదలచుట పేరాశయని మరల మూడవ తరగతిలో చేరదలచితిని. ఇటుల చేయుట నాకేకాక నా గురువునకును తలవంపులమారి పని; ఏలన నా వ్యాసంగమును విశ్వసించికదా ఆయన నన్ను పైనవేసెను - అను ఈ రెండు భయములును నన్ను ఆ తరగతియందే ఉంచెను. ప్రబలముగా వ్యాసంగము చేసి యూక్లిడ్‌లో ౧౩ వ ప్రాపొజిషన్‌వరకు రాగా, అట నుండి క్షేత్రగణితము అన్నిటికంటె రుచికరమైనదిగా గోచరించెను. తనంతట తాను తెలివి తేటలను, సరళప్రయోగమును ఉపయోగించి చూడదగిన విషయమున కష్టముండదు. నాడు మొదలుకొని నాకు రేఖా గణితమునెడ సౌలభ్యమును, అభిరుచియు కలిగెను.

సంస్కృతము మరీ కష్ట మనిపించెను. రేఖాగణితమున వల్లన వేయదగిన దేదియు లేదు. ఇక సంస్కృతముననో, ప్రతిదియు కంఠ పాఠముగా ఉంచుకొనవలెనని నా ఊహ. ఈ పాఠముకూడ నాలుగవ తర గతినుండి ఆరంభింపబడును. ఆరవ తరగతిలోనికి వచ్చుసరికి బెదరి పోతిని. సంస్కృతోపాధ్యాయుడు పాఠము ఎక్కువ ఇచ్చి అంతయు ఒక్కమారు నూరిపోయు స్వభావము కలవాడు. సంస్కృతోపాధ్యాయు లకును, ఫారశీకోపాధ్యాయులకును ఏదోస్పర్ధ ఉండెడిది. ఫారసీ మౌల్వీ సౌమ్యుడు. ఫారసీ మిగుల తేలిక యనియు, మౌల్వీ విద్యార్థులయెడ దయాదాక్షిణ్యములు కలవాడనియు బాలురు తమలో తాము అనుకొను చుండెడివారు. ఈ తేలికతనము నన్ను బెల్లించెను. ఒకనాడు పోయి ఫారసీ

తరగతిలో కూరుచుంటిని. అందులకు సంస్కృతోపాధ్యాయుడు దుఃఖించెను. అతడు నన్ను పిలిపించి 'ఓయీ, నీ వెవరి కుమారుడవు ? నీ మత భాషను నీవు నేర్చుకొనగోరవా ? నీకు తెలియనిచో నన్నడుగుము. నా శక్తికొలది విద్యార్థులకు సంస్కృతము బోధించు కోరిక నాకు కలదు. చదివినకొలది తన్మయము చేయు విషయములు మీకు కానిపించును. అధైర్యము వలదు. మరల వచ్చి నా క్లాసులో కూరుచుండుము' అనెను. వారి దయచే నాకు సిగ్గు పుట్టెను. గురుప్రేమను తిరస్కరింప జాలక పోయితిని. నేడు నా యాత్మ కృష్ణశంకర పాండ్యాగారి ఉపకారమును స్మరించుచున్నది. ఆనాడు ఆ కొలది సంస్కృతమునేని నేను చదివి యుండనిచో మన శాస్త్రములందు ఆనందింప శక్తుడ కాకపోవువాడనే. కాని 'సంస్కృతము ఎక్కువ చదువుకొనలేదే' అని నాకు విచారము కలదు. ఏలన, ప్రతి హిందీబాలుడును, బాలికయు సంస్కృతము చక్కగా చదువుకొని తీరవలయునని ఇటీవల ఎరిగికొంటిని.

భరతవర్షమున ఉన్నత విద్యాప్రణాళికలో మాతృభాషయు, ఉపరి హిందీ సంస్కృత పారసీ అరబ్బీ ఇంగ్లీషు భాషలు పాఠ్యములుగా చేయ దగినవని నా ఆశయము. ఈ సంఖ్యకు భీతిల్ల పనిలేదు. మన విద్య యింతకంటె క్రమబద్ధమై ఉండి బాలురకు ఇంగ్లీషుభాషలోనే పాఠములు నేర్వవలసిన బరువు లేకుండినచో ఈ భాషలన్నియు నేర్చికొనుట ఒక శ్రమగాక మహోల్లాసమగునని నాకు గట్టినమ్మకము. ఒక భాష శాస్త్రీయముగా అభ్యసించినచో మిగిలిన భాషలు సులభతరములు.

విచారించుచో హిందీ, గుజరాతీ, సంస్కృత భాషలు ఏకభాషయే అని అననగును. అట్లే పారశీ అరబ్బీ భాషలు ఏకభాష. పారసీ భాష సంస్కృతమువంటిదయ్యెను, అరబ్బీ భాష హీబ్రూవంటిదయ్యెను ఈ రెంటికిని ఒక దగ్గర చుట్టరికము ఉన్నది. ఈ రెండును ఇస్లాము మత

ముతో వర్ధిల్లినవి. ఉరుదు భాషను వేరుగా ఎన్నను. ఏలనగా, దాని హిందీ వ్యాకరణ సమావేశమును, ఫారసీ అరబ్బీ పదములును గలవు. గుజరాతీలోగాని, హిందీలోగాని, బంగాళీలోగాని, మరాఠీలోగాని మంచి ప్రవేశము ఉండవలయు నన్నచో సంస్కృత మెటులు రావలయునో, ఉరుదులో పాండిత్యము సంపాదించవలయుననిన ఫారసీ అరబ్బీలు రావలెను.

(గాంధీజీ ఆత్మకథనుంచి)
అను. వేలూరి శివరామశాస్త్రి

# మన వర్తక వ్యాపారము

ప్రాచీనకాలంనుంచి ఇప్పటికి రమారమి రెండువందల సంవత్సరాల క్రిందటిదాకా మన ఆంధ్రదేశ వర్తక వ్యాపారం సాగించేటువంటి వర్తకులకు చిత్రమైన పేరులు ఉండేవి. ఈ వర్తకులను దేశి, పరదేశి, నానాదేశి అనేవారు. దేశివర్తకులు మనదేశంవారు. హిందూదేశములోని ఇతర దేశాలనుంచీ వచ్చే పరదేశాలనుంచీ వర్తకులను పరదేశి, నానాదేశి అనేవారు. ఈ వర్తక సమూహానికి అంతకు - వారు దేశీయులయినాసరే, పరదేశీయులైనాసరే - ఇంకొక పేరు ఉంది. అది ఏమిటంటే చాలుమూల సమస్తదేశాల పెక్కండ్రు. ఇవి మన పూర్వులు వ్యాపారంచేసే వర్తకులకు పెట్టిన పేరులు. దేశి, పరదేశి వర్తకులు ఉభయులను ఉభయదేశి అనికూడా వ్యవహరించేవారు. ఈ వర్తకులు నాటున దేశంలోను, సముద్రంమీదకూడా వ్యాపారం సాగించేవారు. ముందు నాటున సాగిస్తూ వచ్చిన వ్యాపారాన్ని గురించి చెపుతాను.

పూర్వం మనదేశములో ఇప్పటిలాగ రోడ్లూ, రహదారులూ ఉండేవి కావు. దేశము అడవి బలిసి ఉండేది. అడవిదారులలోనూ, డొంకతోవలలోనూ ప్రయాణం చేయవలసి వచ్చేది. దారులు కొట్టే దొంగలు ఎక్కువ. అడవి జంతువుల ఉపద్రవం ఉండేది. ఈ కారణం చేత వర్తకులు గుంపులు కట్టి వెళ్ళేవారు. ఒక్కొక్క గుంపులో వందల కొద్దీ ఉండేవారు జనం. ఒక్కొక్క వర్తకుడు చాలా సరకులతో వ్యాపారం చేసేవాడు. ఈ కారణంచేత ఒక్కొక్క వర్తకునివద్ద వంద మందీ, వందయేభై మందీ నౌకరులు ఉండేవారు. ఈ సరకులను సాధార

ఙముగా ఎడ్లమీదా, గుర్రాలమీదా, కంచరగాడిదలమీదా తీసుకువెళ్ళేవారు. ఒక పెద్ద గోనెపట్టాను ఈ చివరా ఆ చివరా సంచులుగా కుట్టి, వాటి నిండా ఉప్పు, ధాన్యము మొదలైన సరకులతో నింపి దానిని జంతువుల వీపుమీద కుడివైపు కొకసంచి, ఎడమవైపు కొకసంచి ఉండేటట్టు అడ్డముగా వేసేవారు. దీనికి పెరికె అని పేరు. ఈ విధముగా వ్యాపారం చేసే వారిని పెరికీలని, పెరికెసెట్లని అనేవారు. ఒక వర్తకుల గుంపుబయలు దేరిందంటే దానిలో ఎంతోమంది వర్తకులు, వర్తకుల నౌకరులు, ఎన్నోరకాల సరకులు, ఆ సరకులు మోసే జంతువులు, దారిలో దొంగలు కాని అడవి జంతువులు కాని అడ్డగిస్తే తమ్ము తాము కాపాడుకోడానికి అవసరమైన ఆయుధాలు, దారి మకాములలో వంట చేసుకోడానికి అవసరమైన ఆహారసామగ్రి - ఒకటేమిటి, అదొక వర్తకపుసేన. ఈ విధమైన వ్యాపారుల సమూహానికి సాతు అని, బిడారు అని పేర్లు. దగ్గర ఊళ్ళకు, దగ్గర సంతసావిళ్ళకు సరకు బండిమీదవెళ్ళేది ఆత్మరక్షణకోసం పూర్వ కాలములో దూర ప్రయాణాలకు, వర్తక వ్యాపారానికి ఇట్టి పరస్పర సహకారమూ, గుంపుగా ఏర్పడడమూ అవసరమయేది. జంతువుల మెడలలో గంటలు కట్టి వాటిని చిత్రవిచిత్రముగా అలంకరించేవారు.

ఇది ఇట్లా ఉండగా ఒక్కొక్క దినుసుతో వ్యాపారం చేసేవారు ఒక్కొక్క సంఘముగా ఏర్పడేవారని ఇదివరకు చెప్పితిని కాదూ? ఇట్టి సంఘాలను సంస్కృతములో శ్రేణులు అనేవారు; ఇట్టి వ్యాపారసంఘాలు సాతవాహనరాజుల కాలంనుంచీ చాలా ఉండేవి. ఇవి ఇప్పటి ట్రేడ్ యూనియనుల వంటివి. కట్టుదిట్టమైన పద్ధతులతో వీటిని నడిపేవారు.

సాధారణముగా సరకు అమ్మకమూ కొనుగోలూ విశేషముగా పెద్ద పెద్ద సంతలలోను, తిరునాళ్ళలోను, తీర్థములలోను జరిగేది. సంతకు

(2)

అమ్మవచ్చే సరకుమీదా, సంతమంచి వర్తకులు కొని తీసుకపోయే సరకు మీదా పన్ను తీసేవారు. ఈ పన్నుకు సుంకము అని పేరు. ఈ పన్ను వసూలు చేసే ఉద్యోగులు సుంకరులు.

వ్యాపార ప్రయాణాలలో వర్తకులు గోదావరి, కృష్ణ, తుంగభద్రలవంటి నదులు దాటవలసివచ్చేది. వర్తకులు వీటిని ఒక రకం పడవలమీద దాటేవారు. ఈ పడవలు మనకు ఇప్పుడు పరిచయమైన కర్ర పడవలూ కావు. స్టీమరులూకావు. అవి గుండ్రనగా చెరకు పెనాలలాగ ఉండేవి. వాటిని పేముతో అల్లి వెలుపలివైపు దున్నపోతు చర్మముతోను, గేదె చర్మముతోను కప్పేవారు. ఈవిధమైన పడవకు పుట్టి అని పేరు. ఈ పుట్లు గుండ్రముగా తిరుగుతూ ఇవతలి ఒడ్డునుంచి అవతలి ఒడ్డుకు పోయేవి. రేవులలో ఇట్టి పుట్లు ఉండేవి. ఈ పుట్లమీద రేవు దాటే వర్తకపు సరకుమీద పుట్టి సుంకాలు వసూలు చేసేవారు. మన దేశంలోని నదులలోను చిన్న ఏళ్లలోను 1800 ల వరకు రేవులు దాటడానికి ఇవే పడవలు. కాకతి ప్రతాపరుద్రదేవ మహారాజును ఢిల్లీకి తీసుకొని పోయే టప్పుడు తురక సర్దారులు గోదావరి దాటించినది ఈ రకము పడవల లోనే.

ఇక సముద్ర వ్యాపారాన్ని గురించి చెపుతాను. వెనుకటి ప్రసంగాలలో మీకు కొద్దిగా సూచించాను. సాతవాహన, ఇక్ష్వాకు, చాళుక్య, కళింగ, గాంగ రాజవంశాలవారి కాలములో మన దేశవర్తకులు సముద్రాలమీద సబురులు చేసి తూర్పుదేశాలతోను, ద్వీపాలతోను వర్తక వ్యాపారం చేసేవారని, హిందూదేశ వర్తక వ్యాపారములో ఒక చిత్రం ఉంది. అది ఏమిటంటే, ప్రాచీనకాలంనుంచీ మనదేశము పడమటి దేశాలతో జరుపుతూవచ్చిన వ్యాపారమంతా పడమటిదేశ వర్తకులవశాన ఉండేది. వీరిలో మొదటివారు ఆఫ్రికాలోని ఈజిప్టుదేశంవారు, తరువాతి

వారు గ్రీకులు, తరువాతివారు అరబ్బులు. క్రీస్తుశకం పదకొండు, పన్నెండు శతాబ్దుల దాకా పడమటి దేశాలతోడి హిందూదేశ వ్యాపారమంతా అరబ్బుల వశంలోనే ఉండేది. తూర్పుదేశాలతోడి వ్యాపారమంతా హిందూదేశపు వర్తకుల వశాన ఉండేది. ప్రాచ్యదేశ వర్తక వ్యాపారం సాగించిన మొదటి హిందూదేశీయులం మనమే-ఆంధ్రులమూ, కళింగులమూను. తరువాత ద్రావిడులు. అటువెనుక గుజరాతీలు, ఆ పిదప బంగాళీలు మొదలైనవారు ఈ వ్యాపారములో పాల్గొన్నారు. మనము ఈ వ్యాపారములో ముందడుగు వేయడానికి కారణం ఇది. మన ఆంధ్రదేశము చాలా భాగము సముద్రతీరాననే ఉంది. నదీతీరాన ఉన్నవారికి సాధారణముగా ఈత ఎట్లా వస్తుందో ఆ విధంగానే సముద్రపు ఒడ్డున నివసించేవారికి సముద్రంమీద సబురులు చేసే సాహసం సహజముగా అలవడుతుంది. సముద్రతీరవాసులు గొప్ప నావికులు అవుతారు. అదీగాక దక్షిణ హిందూదేశంలోని మొదటి మహారాజ్యం మనదే.

మన దేశములో సముద్రపు ఒడ్డున ఎన్నో కరపట్టణాలు ఉండేవి. రేవు పట్టణాలను పూర్వం కరపట్టణా లనేవారని చెప్పితిని కాదూ? మన దేశముతో వర్తక వ్యాపారం సాగించిన పశ్చిమదేశాల నావికులూ, భూగోళశాస్త్రజ్ఞులూ ఇటువంటి కరపట్టణాలు మన దేశంలోనివి ఎన్నిటినో చెపుతారు. ఇట్టివారిలో పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియన్ సి అనే గ్రంథము వ్రాసినయతడు, ప్లీనీ, టాలెమీ అనేవారు ముఖ్యులు. వీరిలో కొందరు మన హిందూదేశముతో ఓడ వ్యాపారం చేసినవారు చెప్పిన విషయాలు విని వ్రాసినవారు. వీరు అరబ్బీ వ్యాపారులకంటె పూర్వులు. వీరు విదేశీయులు అవడంచేతను, మనదేశపు పేరుల ఉచ్చారణ వారికి వికృతముగా ఉండడంచేతను, వారికి ఈ పేరులు కొత్తవి అవడంచేతను అవి ఆ విదేశీయుల పలుకుబడిలో మారిపోయినవి. అందువల్ల మనదేశంలోనివని

వారు చెప్పిన కరపట్టణాలలో ఏ వొకటి రెంటినో తప్ప మిగిలినవాటిని గుర్తించడమే కష్టముగా ఉన్నది. పొదుకె, కొట్టిస్, మనర్ఫ, కటికర్దమ, అలోసిగ్నె, కన్నగర-ఇట్టివి చాలా ఉన్నవి. వారు చెప్పిన దేశాలు నదులు గుర్తించడములో కూడా కష్టము ఎక్కువై ఊహలమీద ఊహలు పెరిగినవి. టిన్న, మైసోలస్ అనేవి మన దేశములోని నదులట. మైసోలియా అనేది మన దేశములోని ఒక రాష్ట్రమట. మరి ఇవి ఇప్పుడు వేటికి వర్తిస్తవో. మనకు వారు చెప్పిన కరపట్టణాలలో గుర్తింప గుదిరినవి రెండేరెండు; ఒకటి కొంటకస్సిల, రెండవది కొడ్డూర. కొంటకస్సిల ఇప్పటి ఘంటసాల; కొడ్డూర ఇప్పటి బందరు దగ్గర గూడూరు. రెండూ కృష్ణాజిల్లాలోనివే; కృష్ణానదీ ముఖద్వారందగ్గర ఉన్నవే. దంతపురము అనేది కళింగంలోని ప్రముఖమైన కరపట్టణము. అది ఎక్కడ ఉన్నదీ ఇంకా తెలియదు. ప్రధానముగా ఈ మూడు రేవులనుంచీ ఆంధ్ర వర్తక వ్యాపారులు తూర్పుదేశాలకూ, ద్వీపాలకూ వెళ్లేవారు.

సాతవాహనరాజుల కాలంనుంచీ రెండుమూడు వందల సంవత్సరాల క్రిందటిదాకా మన ఆంధ్రదేశము ఇతర దేశాలతో సాగించిన ప్రధాన వ్యాపారము నూలుబట్టలూ, అద్దకపు బట్టలూ, అతిసుందరమైన పలుచని మల్లు సెల్లాలూను. సాతవాహనరాజుల కాలములో ఇవి యూరోపు ఖండ దేశమైన ఇటలీకికూడా వెళ్లేవి. ఆ కాలములో రోముచక్రవర్తులు ఇటలీ పాలిస్తూ ఉండేవారు. మనదేశపు వర్తకులు రోము వర్తకుల వద్ద నుంచి బంగారము తీసుకొని బట్టలు ఎగుమతి చేసేవారు. ఈ కారణంచేత రోము చక్రవర్తుల నాణెములు మనదేశములో ప్రత్తి పండే ప్రాంతాల గుంటూరు జిల్లా వినుకొండ ప్రాంతానను, కడపజిల్లాలోను దొరికినవి. ఆ విధంగానే మన పూర్వ చాళుక్య రాజయిన విమలాదిత్యుని అన్నగారు శక్తివర్మ బంగారు నాణెములు అరకాను, సయాము దేశాలలో కనబడినవి.

వీటినిబట్టి మనదేశవర్తకులు సాతవాహనుల కాలంనాడూ, అటుతరువాతను కూడా తూర్పుదేశాలతో వర్తకము సాగిస్తూ వచ్చినట్టు ధ్రువపడుతున్నది.

తూర్పుదేశాలనుంచి, ద్వీపాలనుంచి మన సరకు చీనావారి ఓడలలో వచ్చేది. ఈ ఓడలు చీనాదేశంనుంచి హిందూమహాసముద్రములో మలబారు తీరందాకా సబురులు చేసేవి. ఈ చీనావారి ఓడలకు జోంగులని పేరు. వీటిని ఇంగ్లీషులో జంక్స్ అంటారు. వీటికి ఒక్కొక్కదానికి మూడేసి, అంతకు ఎక్కువగాను వెదురు వేపబెత్తములతో అల్లిన తెర చాపలు, యాత్రికులు ఉండడానికి వీటిలో గదులు ఉండేవి. జోంగులు పెద్ద ఓడలు. ఒక్కొక్క పెద్ద ఓడకు వేయేసిమంది కళాసులూ, నావికులూ ఉండేవారు. చిన్న ఓడలకు నాలుగు వందలమందీ ఆరువందలమందీ ఉండేవారు. వీరిలో విలువిద్యలో ఆరితేరినవారు కూడా ఉండేవారు. ఒక్కొక్క పెద్ద ఓడతో చిన్న పడవలు మూడునాలుగు ఉండేవి. మన దేశాన్నుంచి తూర్పు దేశాలకు సంవత్సరానికి ఒక్కసబురు సాగేది.

మాండలిక యుగములో సముద్రవ్యాపారము మందగించినది. దానికి కారణం ఇది. ఆంధ్రదేశపు కరపట్టణాలకు సరకులు వేసుకొని వచ్చిన ఓడలను సముద్రప్రాంతాన ఉన్న మండలికులు కొల్లగొట్టేవారు; ఎక్కువ సుంకాలు తీసేవారు. ఎప్పుడయినా ఏ గాలితుపానులకయినా వర్తకపు టోడలు ఒడ్డుపట్టినా, బ్రద్దలయి ఒడ్డుకు కొట్టుకొనివచ్చినా సరకు బలవంతాన తీసుకొని వర్తకులను హింసించేవారు. ఈ కారణాన మాండలికయుగము చివరికాలములో ఆంధ్రదేశపు రేవులు ఎన్నో చాలా పాడయిపోయినవి. ఇటువంటి స్థితిని గమనించి ఓరుగంటి గణపతి దేవ మహారాజు పూర్వాంధ్రదేశాన్నంతా జయించిన తరువాత సముద్రాల మీద ఓడ వ్యాపారముచేసే వర్తకులకు అక్రమాలు ఏవీ జరగకుండా రక్షిస్తా

వని అభయహస్తం ఇచ్చాడు; ఎగుమతి, దిగుమతి సరకులమీద సుంకాలు నిర్ణయించాడు.

గణపతిదేవమహారాజు కాలములో గుంటూరుజిల్లాలోని మోటుపల్లి గొప్ప రేవుపట్టణము. అప్పటికి ఘంటసాల, గూడూరు రేవుల ప్రభ తగ్గిపోయింది. వెనీసుదేశస్థుడయిన మార్కొపోలో అనే యాత్రికుడు క్రీ.శ. 1280 ప్రాంతాన ఈ మోటుపల్లి రేవులో దిగి ఇక్కడి మల్లు సెల్లాలు చూచి అవి సాలీనిదారముకంటెను సన్నని దారముతో నేసినవనీ, ఇటువంటి మల్లు సెల్లాలు తాను ఎక్కడా చూడలేదనీ వ్రాశాడు.

కాకతీయ సామ్రాజ్యము క్రీ. శ. 1323 లో కూలిపోయిన తరువాత మరల ఓడల వ్యాపారానికి దెబ్బతగిలింది. మోటుపల్లికూడా తురక సర్దారుల, మండలికుల చేతిలో పడి పూర్వపు వైభవం గోల్పోయింది. తూర్పుదేశాలతో వర్తకం ఏ మాత్రంగానో జరుగుతూవచ్చినా కొండవీటి రెడ్డిరాజులు పూర్వాంధ్రదేశాన్ని వశంచేసుకొని తమ అధికారం బాగా స్థాపించినదాకా తెలుగు దేశపు ఓడల వ్యాపారం బాగుపడలేదు.

—మల్లంపల్లి సోమశేఖరశర్మ

# సర్వమంగళ

నిన్ను వెదుక్కుంటూ వచ్చానమ్మా!

ఇంతదూరం, ఎక్కడో కృష్ణా తీరాన్నుంచీ,...చల్లని తల్లివి.... కష్టాలన్నీ విని, కడుపులో పెట్టుకు అదరిస్తావని, నీలో కలసిపోదామని వచ్చానమ్మా!

సహించారు; మనసులో ఎంత అసహ్యపడుతున్నా, బయటికి కనబరచకుండా, ఆదరంతో చూస్తూ, తమ ఔదార్యాన్ని ప్రకటించుకుని, లోకంచేత 'ఆహా' అనిపించుకుని, కోటి యజ్ఞాల ఫలం దక్కినట్టు, మురిసిపోయినారు. కాని, అర్థం చేసుకుని, అనుతాపంలో పాలు పంచుకోలేని ఈ లోకానికి....ఎంత దూరమైపోతే మాత్రం ఏమమ్మా.

నావాళ్లే నాకు కానివాళ్లైనప్పుడు...పంచప్రాణాలూ, మమకారం నిల్పిన వాళ్ళే, వంచనచేస తూలనాడి నప్పుడు...కోరికలు, ఇక ఈ జన్మకు తీరవనే నిరాశ కుదురుకుపోయిన తరువాత....బ్రతికి మాత్రం ఫలమేమున్నదమ్మా!

తీరా....ఇక ఎన్నటికీ కనపడనని తేలిపోయిన తర్వాత... అన్నయ్య, పాపం, తల్లీతోడూ కనుక...విచారపడతాడు. నా జీవితం అంతా అడవికాచిన వెన్నెల అయిపోయినప్పటికీ.... నా బాధలన్నీ నేను భరించుకుంటూ, ఇంట్లో చేదోడు వాదోడుగా ఉండి, అక్కరకు అడ్డు పడుతూన్నన్నినాళ్ళూ.... ఆయనకేమీ చీమంత అయినా నా గొడవ పట్టలేదు; ఇప్పుడు మాత్రం, ఇబ్బంది వచ్చినప్పుడు, ఆదుకునేందుకు

మనిషి లేకపోయిందికదా అని నన్ను తలుచుకుంటాడేమో ; అదైనా ఎంతసేపులే....వదిన కౌగిలిలోకి వెళ్ళిపోయిన తరువాత లోకాన్నే మరచి పోతాడు.

మా చెల్లెలు, జానకా, అభం శుభం దానికి ఏం తెలుసు ? దాని పెనిమిటి నాకు చేసిన అపకారం...కాదు, ఉపకారం... దానికి తెలిస్తే... ఓర్చుకుని, భరించగల జాణతనం... ఆ అమాయకురాలికి, పసిపాపకు ...ఏదమ్మా !

'వయసు మళ్ళుతూన్నవాడు...కొరకరాని కొరివి...ఆ నికృష్టు డికి బంగారంవంటి పండువంటి తల్లిని కట్టిపెట్టవద్దు...ఇది సుతరామూ కూడదు...రెండో పెళ్ళివాడితో అది బావుకునేది ఏమిటి ?' అని, నేను పట్టుబట్టి, ఆ సంబంధం మానిపించాలని, శాయశక్తులా అన్నయ్యతో పోరుపెట్టాను ; కాని, నా మాట వింటాడా, పిల్ల సుఖపడుతుందట !... ఆ మాటకు అర్థం ఉన్నదా ? ఆడది సుఖపడటం అంటే ఏమిటో, ఆ మొగరాయుడుకు తెలుసునా ? ముద్దినుసు నగలూ చీరెలూ, ఇనపపెట్టెలో నిండు సంచూలూ చూసుకుంటే కడుపు నిండిపోతుందా ?— పైగా, నేను యింకా ఏమన్నా అనిపోతానేమోనని...'మొదటి పెళ్ళివాడని...పిల్లవాడు చిన్నవాడని... నిన్ను ఇస్తే... ఏమైందట చెప్పు...అయుర్దాయం ఉండాలి, సుఖపడి అనుభవించే యోగం ఉండాలి కాని...' ఈ మాటలకు నా నోరు కట్టుబడింది ... మనసు చిల్లులు పడిపోతే మాత్రం... అతనికేం ?

మూడు ముళ్ళూ పడ్డాయి. పడ్డ ఆరుమాసాలకే పిల్ల ఈడేరింది. వడసారం, పదమూడో ఏడు సగపాలైనా గడవలేదు. పిల్ల ఏపరికాదు. కాకపోతేనేం. మూడు ముచ్చట్లూ తీరిన తరువాత, ఒక్క క్షణం ఉండ నిచ్చాడా పిల్లను నట్టింట ! గద్ద తన్నుకుపోయినట్టే - నేను మళ్ళా

నోరు చేసుకున్నాను. అప్పుడుగూడా...అన్నయ్యతో, నెమ్మదిగా... ఇంకో సంవత్సరమన్నా ఆగితే మంచిదని, బావగారితో ఎలాగైనా చెప్పి ఒప్పించు; పిల్ల కొంచెం రెక్కొచ్చేగాని, ఇప్పటినుంచీ కాపురం ఏం దిద్దుకుంటుంది? ఇంకో దిక్కులేదు, వంటరి గాణ్ణాయెను...' అని బ్రతిమాలుకున్నాను. అన్నయ్యకే ఈ ఊహ తట్టవలసింది...పోనీ, వినైనా హర్షించడా అనుకుంటే, అలా కాకపోగా, పైపెచ్చు ఎదురు తిరిగి...'ఎంతకాలం నోట్లో వేలువేసుకు కూర్చుంటా డనుకుంటావు. ఆడదిక్కు లేకనే, గూట దీపంపెట్టేవాళ్ళు లేకనేగా...వెంటనే పెళ్ళి చేసుకుంది...ఏం, తీవెళ్ళిందా ఏం...దాని ఈడుకు నేను అమ్మకు కడుపున పడ్డానుట...ఇంకా ఆయన పుణ్యమా అంటూ మంచివాడు కనుక, ఇంతకాలం ఆగాడు. మనం చూడటంలేదూ, లోకంలో... వెంటనే...పసుపు బట్టలతోనే తీసుకువెళ్ళి కాపురం పెట్టుకున్నవాళ్లు ఎంతమంది లేరు? – అలా చేస్తేమాత్రం, వద్దనగలిగేవాళ్ళమా? నీ మాటలకేంలే? నట్టింట కనబడుతూన్నన్నాళ్ళూ...ఎంత వయసువచ్చినా, మనకు పసిపిల్లే...అవతలవాళ్ళ కష్టసుఖాలుకూడా కొంచెం యోచించ వద్దూ...' అంటూ నన్ను గదమాయించి, బావమరిదిని వెనకవేసుకు వచ్చాడు. నేను అనేదేముందీ ఇక... అన్నింటికీ తల ఊపవలసిన దాన్నే నాయెను; పోనీ, చెప్పిచూస్తే వాళ్లెవరైనా ఉన్నారా అంటే ఇరు పొర్గ్వాలా నా అన్నవారు లేరు.. ఇటు మా అన్నయ్యా...అటు మా జానకి మొగుడు పూర్ణయ్య శాస్త్రుల్లూ...ఎవరి యింటికి వారే పెద్దలు!

సరే, ఆకాస్త ముచ్చటకూడా తీరిపోయింది. గది అలంకారాలన్నీ ఇరుగమ్మా, పొరుగమ్మా ఎవరో చెయిచేసుకుని కానిచ్చేశారు. నాకు, ఒకసారి తొంగిచూడ్డానికైనా మనసు ఒప్పలేదు. పిండివంట దగ్గర

కూర్చున్నంతసేపూ, కంట నీరుపెడుతూనే ఉన్నాను. పొగపోయి కళ్ళు ఎర్రబారిన వనుకున్నారు — పేరంటాళ్లు — మనసు ఎంత కుమిలి పోతూన్నదో ఎవరూ గ్రహించలేదు... నయమే అదీని!

ఇక...ఆ కాపురం ముచ్చట్లు ఏమని చెప్పేది. మూడు నిద్దర్లూ కాగానే, తెల్లవారితే మంగళవారమైనా, నిమిషం నిలవకుండా తర్లించుకు వెళ్ళిపోయినాడు...తీసుకువెళ్ళి కత్తులబోనులో ఇరికించాడు. మెదలడానికి వీలులేదు. కూరనార అమ్మవాళ్లతోనైనా మాట్లాడకూడదు. మగపురుగు కంటపడరాదు... మాప్రక్కవీధిలోనే ఉన్నా....పోయి ఒకమారు కంటనైనా చూద్దామంటే, నాకు అసలు పారాగత్తెం ఉందీ! ఇక, బండిలో కాలుపెట్టబోతూ, నేను మడిగట్టుకుని, ఊరగాయలు సర్దుతూంటే బెదురుకుంటూవచ్చి, నన్ను కావలించుకుని .. 'ఒక్కరైనూ ఉండలేనే రోజూ వచ్చి చూసి వెళుతూండవే అక్కయ్యా!...మిమ్మల్నందర్నీ విడిచి వెళుతూంటే, ఏమిటో తగని దిగులుగా ఉందే....' అని గావురు మన్నది. నేనూ, అధైర్యపడితే కుర్రది మరీ బెగ్గటిలి పోతుందని, రొమ్ముకు అదుముకుని... సముదాయించాను. చెపుదా మనుకున్న నాలుగు మాటలు చెప్పకముందే... అన్నయ్య, బండీవాడూ తొందరపడుతున్నాడని వచ్చి మా కిద్దరికీ ఎడబాటులు చేశాడు. ఆ తరువాత వాడన్నా తిరిగి చూశాడా —నేను అనుక్షణం పోరుతున్నా — 'ఏముంది చూసేందుకు — వాళ్ళ కాపురం వాళ్లు చేసుకుంటున్నారు. చీటికి మాటికీ - ఇట్టే అట్టే మనం గనక వెళుతూంటి మాయెనా, తనమీద ఏం నేరాలు చెపుతూందో — మనకేం దోచిపెడుతూందో అని అయన అనుమాన పడవచ్చును- లేనిపోని కలతలు తెచ్చిపెట్టడం ఎందుకూ —' ఇలా సాకులుచెప్పి తప్పించుకుంటూండేవాడు.

వారం రోజులైంది. వాకిట్లో...ప్రొద్దున్నే ముగ్గు వేస్తూండే వేళక శాస్తుర్లు పీభూతి పెండెకట్టుతో ఊడిపడ్డాడు...'అంబయ్యా ఇంకా

నిద్ర లేవలేదుటమ్మా...' అని రోడ్డుమీద నిలుచునే ఓపొల్లు కేక పెట్టాడు. పలుదోముపుల్ల తిరితిప్పి నములుకుంటూ, అన్నయ్య, కేకవిని. లోపలి నుంచి వచ్చి... ఆయన్ను రమ్మని తలపిసిరాడు. మెట్లు ఎక్కుతూ, నావంక మోర పెట్టి...'దానికి కొంచెం నలతగా ఉందమ్మా... చెయ్యి తీరికఅయిన తరువాత ఒక్కసారి వచ్చి చూసి—' అని, అన్నయ్యతో ఏదో ఈమాటా ఆమాటా ఆడి వెళ్ళిపోయినాడు.

వినేటప్పటికే నాకు కాళ్ళూచేతులూ ఆడలేదు. ముగ్గుబుట్ట అక్కడే పారేసి పరుగెత్తాను. పోయిచూద్దును గదా, పిల్లది బొత్తిగా లోజెద్దది. గడపలో కాలు వెట్టినప్పటినుంచీ మూసిన కన్ను తెరవడం లేదుట... ఆయన, ఒంటిపూట ఇంత ఉడకేసుకు తింటూ .. దానికి జావ కాచి పడేస్తూ... వ్యవహారం ముదిరేదాకా.. తీసుకు వచ్చాడు. నన్ను చూసే టప్పటికి.. జానకికి ప్రాణం లేచి వచ్చింది. ఏముందీ, ఒకరినొకరు కావిలించుకుని... దాన్ని చూసి నేనుఏడవా...నన్నుచూసి అది ఏడవా: ఇంతలో అన్నయ్య కూడా వచ్చాడు. స్థితి గతులు తెలిసిన తరువాత వాడికీ వెష్టబుట్టింది. ఆ పాళంగా పోయి దాక్టరును తీసుకొచ్చాడు టైఫాయిడ్ అని తేలింది.

మాయింటికి తక్షణం తీసుకువెళ్దా మన్నాను. అ పిసినారికి ఖర్చు తగ్గడమే కావాలిసింది...వెంటనే సరే అన్నాడు. కాని, ఒక చిక్కు వచ్చింది. మా వదినె, కార్యం అయిపోయిన మర్నాడే పురిటికి వెళ్ళింది. అన్నయ్య ఆ సాయంకాలమే దొరతో సర్కీటు వెళ్ళాలట...సెలవు దొరికే నౌకరీ కాదాయెను. మళ్లీ తిరిగి రావడానికి ఏ ఇరవై రోజులో పడుతుంది...అంతవరకూ, రెండోదిక్కు లేకుండా నేను నిభాయించడం ఎలా? ఏమిటీ చేయడం ఇప్పుడు? నాకు ఎంతమాత్రమూ ఇష్టంలేక పోయినా, ఆ మానవుడు, ఉండమని అనకపోయినా, తప్పిందికాదు. అది, మళ్ళాలేచి ప్రజల్లో పడేదాకా అక్కడే నాకొలువు.

తిరిగి వచ్చి, మడి ధోవతులు పట్టుకుని వెళ్ళి... వేగిరం స్నానం చేసి వంటచేశాను. అన్నయ్య, మొగమాటం చంపుకుని ఆ పూట అక్కడే భోజనం చేసి సాయంత్రం బండికి వెళ్ళిపోయినాడు.

క్రమంగా, ఆ రోజు కారోజు ముసలాయన రుసరుసలు మాని, కొంచెం ముఖం విప్పారి ఉండేవాడు. షడ్రసోపేతంగా చేసి పెడుతూంటి నాయెను; ఏం తీపెళ్ళిందా...వేళకు అన్నీ అమరుస్తూంటే; మొదటిలో మాటా పలుకూ లేకపోయినా, ఆనాటికానాడు, అదీ ఇదీ కనుక్కోడం... భోజనం ముందర లోకాభిరామాయణం వేయటం...ఆషామాషీలాడటం... నన్ను నవ్విస్తూండటం...మొత్తానికి, నాచేత అక్కరకు వచ్చినట్టే ఉంది: మనిషి కవళికలో కొంత మార్పు కనిపించింది. నాకుకూడా, మొదట ముళ్ళమీద వున్నట్టుండి, ఎప్పుడు ఇవతల పడదామా అనిఉన్నా...పోను పోను, కొంత బెరుకు తీరింది.

మూడువారాలు గడిచిపోయినవి. జానకి జబ్బు మళ్లముఖం పెట్టింది. పథ్యంపెట్టి, నేను మాయింటికి వద్దామనుకుంటున్నాను. కాని, మనయత్నమూ, తానొకటి తలిస్తే దైవమొకటి తలచిందని—కావలసిన కార్యార్థం వేరుగా ఉండగా... ఇంతకూ, అన్నీ అల్లా ఒనగూడాయి. అన్నయ్య ఇంకో పదిరోజులదాకా రానని, టపా తీసుకు వెళ్లే జవానుచేత కబురంపించాడు. అందాకా అక్కడే ఉండమని జానకి పట్టు పట్టింది. మామగారు కూడా...ఏకళనున్నాడో...బలవంతం చేశాడు. పోనీలే, వాళ్లు అంత ప్రాధేయ పడుతూన్నప్పుడు...అక్కడ మాత్రం మించి పోయేదేముంది, ఒంటరిగా ఉండాలిసిందే కదా, అన్నయ్య వచ్చేదాకా; పోనీ. ఈలోపుగా పిల్లకు జవపట్టేదాకా ఉండవచ్చునని...అట్టే బెట్టు చెయ్యకుండా మెత్తబడ్డాను.

పడిలేచిందా, అప్పుడే పొయిలాకటకు రానియ్యడానికి నేను ఒప్పుకోలేదు. ఏం గంపచాకిరీ ఉందని? ముచ్చటగా ముగ్గురికి వండి వార్చ

డం ఆరోపనా ? పైగా, మాతల్లి. లేచి తిరుగుతూండటమే నాకు కొండంత సత్తువ తెచ్చింది. జిహ్వచచ్చి ఉందేమో కావలసినవి అడిగి చేసిపెట్టే దాన్ని....

తిన్నది వంట పడుతూన్నకొద్దీ —బాగా తెప్పరిల్లి కోలుకుంటూంది జానకి : సంధ్యపడగానే, ముందు దానికి అన్నం పెట్టేసే దాన్ని -అంగట్లో మెతుకులు అంగట్లో ఉండగానే, చెయి కడుక్కోడం వ్యవధానం పక్క మీద ఒరిగేది —పగలు కునకడానికి వీలులేదేమో - మళ్ళా పొద్దు పొడిచే దాకా ఆదమరచి నిద్రపోయేది. నేను, ఆయన కోసం కనిపెట్టుకొని ఉండి, తిన్న తరువాత - పిండో, పాడో నోట రొట్టుకుని -మూతలు పెట్టేసి – వసారా అంచున మాలతీ పందిరికి దగ్గరగా పక్కవేసుకునే దాన్ని ; జానకి పక్కగదిలో పడుకునేది — కటకటాల తలుపు కనుక— పిలిస్తే పలకడానికి అందుబాటు. ఆయన - ఇంటి ముందు -ఆరు బయట పడుకునేవాడు.

—అర్ధరాత్రి — చప్పున మెళకవ వచ్చింది. పిండారబోసినట్టు వెన్నెల - ఆలకించి చూశాను ; అవతలపక్క, కునిసందులో - కొంచెం అలికిడి వినపడ్డది: నాళ్ళనడుము: దొంగాతోడుమోతూ రావడానికి వీలులేని స్థలం ; ఏమిటో చూద్దామని - లేచి ; మెల్లిగా ఆవేపుకి వెళ్ళాను :

మందారచెట్ల నీడలు పడుతూ నేలంతా, చీకటి వెలుతురూ మాసి కల చదరంగ పాళీలాగాఉంది. మొదట ఏమీ కనిపించలేదు. మళ్ళా పరకాయించి చూశాను : చెట్లచాటున ఎవరో ఉన్నట్టుంది - కాళ్లు చూచా యగా కనిపించినవి. ఒళ్లు ఝల్లుమన్నది : గుండె గొంతుకలోకి ఎగదట్టి కెకుక్కమని - దగ్గు, అరుపు కలసి - కేకపెట్టాను నోట - అరవడాని కైనా—మాటరావడంలేదు : కాళ్లు పాతుకుపోయినాయి—వెర్రి భయంలో రెప్ప ఆడలేదు : గుడ్లు అప్పగించి చూస్తూ నిలబడి పోయినాను.

—మనిషి తొందరగా నడచి పోతున్నచప్పుడు—దొడ్డితలుపు రపేలున పడ్డది : మామరిది, చెట్టుమాటు నుంచీ, నిదానంగా, నా దగ్గరికి వచ్చాడు. నన్ను చూసి—పోల్చుకోక ముందు ఉలికిపడి — అంతలో తెప్పరిల్లాడు : భార్య ఏమోననుకుని భయపడి ఉంటాడు మొదట : అవతల మనిషిని నేను గుర్తించాను : మాయింట్లో పనిచేసే ముత్యాలు.

'ఇక్కడ నిలుచున్నావేం — నిద్రలో నడిచి వచ్చావా'. ఆయన ఏమీ చలించకుండా — మామూలుగా అడిగాడు : నేనేమీ సమాధానం చెప్పకుండా ఊరుకున్నాను. ఒక్కనిమిషం నన్ను పరకాయించి చూసి : 'పోయి పడుకో' అని, ఏదో గొణుగుకుని వెళ్ళిపోయినాడు.

నేను, వెళ్ళి, మళ్ళా మంచం మీద పడుకున్నాను, నిద్రరాదు—ఆలోచనలన్నీ సముద్రకెరటాల లాగా నన్ను ఆవరించి ఊపి వేసినవి. పక్కకుదరక చాలాసేపు అటూ ఇటూ దొర్లాను. ఎంతో సేప టికికాని, ఎటోఅటు పాలు పోయిందికాదు. నిశ్చయాని కంటూ వచ్చిన తరువాత కూడా — తలచుకోవడం, దద్దరిల్లి పోవడం : - ఎలాగై తేనేం, మనసును ఒప్పించాను : జయించానన్న ఉత్సాహంలో - చిరునవ్వు పెదవులపైన మొలకలెత్తుతూండగానే — జోగిపోయినాను :

ఎంతోసేపటికి మళ్ళా మెలకువ వచ్చింది : తట్టి - గిలిగింతపెట్టి లేపినట్లైంది : కళ్లు తెరిచాను ! వెన్నెల మసకవారింది - చుక్క పొడవ బోతూంది : చూపు - మరల్చి - ఆ — వేపుకు—సారించాను : నాకాళ్ల దగ్గర - పాదం పట్టుకుని కదుపుతూ - మా మరది కూర్చుని ఉన్నాడు: నాకు, తెలుసును — ఆయన వస్తాడని — అలా అవుతుందని : నాకు. ఇష్టమే కాదూ -

నేను మసలడం కనిపెట్టి - ఆయన, ధైర్యం చాలక - చటున లేచి నిలుచున్నాడు. ఎక్కడ మనసు మార్చుకుని — బెడిసిపోతాడోనని-

నోరు మెదల్చకుండా — ఆవంక చేతులుజాచి - బలవంతంగా పొదువు కున్నాను - ఆయన్ని సుఖపెట్టడంలో - ఆయన కోసం -నేను లోకం- నన్నే నేను మరచిపోయినాను.

ద్వితీయ విఘ్నం కాలేదు - అలా అవుతుందేమోనని - ఆయన కుండవలసిన ఆదుర్దా అంతా నేను పడ్డాను : వారం రోజులు-వరుసగా-

పొరబాటు కాదు-తెలిసి చేసిన పనే-నన్ను మోసగించలేదు- ఆయన-మొగమాట పడకపోతే-నేనే బలవంతం చేసేదాన్ని-అవునమ్మా ఆ పరిస్థితి అలాటిది : ఏం-నీకుకూడా, ఈ మాటంటే ఆశ్చర్యం వేస్తో న్నదా ? కళ్లు కానరాని కండకావరంతో-అప్పుడు పోతరించిపోయి- ఇప్పుడు ఇంకో వేషం వేస్తోంది-ఇది-ఎంతకైనా తగిందే తెగించిపోయిన తరువాత—అని అనుకుంటున్నావా ?—కాదమ్మా కథ సాంతం విను—

వారం రోజులు దాటిన తరువాత—అనుకున్నదానికన్న ముందర గానే, అన్నయ్య తిరిగి వచ్చాడు : నేను— మళ్ళా మా యింట్లో— గృహప్రవేశమైనాను : అప్పటికి జానకి బాగా లేచి తిరుగుతూ, దానిపని అదే చేసుకునే ధోరణిలో పడ్డది.

నెల్లాళ్ళయింది—కొంచెం బెంగగా ఉంది :

రెండోనెల—అనుమానంగా—అవునా, కాదా అని—ఏలాగో మనసు కుదుటపరుచుకుంటూ తిరిగాను :

మూడోనెల— నిశ్చయమయింది : కొంప నిలువునా కూలి పోయింది. అన్నయ్యకుకూడా అచోకీ తెలిసింది :

ఏం చేస్తాడు, పాపం—నన్నా గద్దించి అడగలేదు—ఎవరితోనన్నా చెప్పడానికా—ఇంకా ఏమన్నా ఉందా—వాడలో ఉండనిస్తారా—త

ఎత్తుకు తిరగనిస్తారా—దాచడమా—ఎంతకాలమనా? ఎప్పుడో ఒకప్పుడు పాపం బద్దలుకాక తప్పుతుందా?

అయిదోనెల జొరబడేదాకా—ఏం చేయాలో తోచక—కాలుకాలిన పిల్లిలాగా—నిలిచినచోట నిలువకుండా— నానా హైరానా పడ్డాడు. ఇక క్షణం తామసించడానికి వీలులేదు—అప్పటికే అమ్మలక్కలందరూ ఎలాగో పసికట్టి—గుసగుసలు పోతున్నారు: అవి ఏమన్నా చెవిని పడ్డవో ఏం కర్మమో—ఎన్నడూ పల్లెత్తు మాట అననివాడు—ఆనాడు ఇంటికి వచ్చీరావడంతోనే రుద్రుడై పోయినాడు—ఒకటని, ఒకటి అన లేదా: అన్నిటికీ ఒడిపట్టి ఊరుకున్నాను.

ఊరుకున్నానన్న మాటేగాని—పైకి నాకూ తరతర బుట్టింది. అంతవరకూ — ముంచుకు వస్తున్నా—మనసు—తుడిచిన పలకలాగా—ఏ ఊహా కనపడకుండా—అదోమాదిరి మైకంగా—ఏదో ఫలానా అని చెప్పలేని బాధగా—సంతోషంగా—ఉంటూ వచ్చింది. అన్నయ్యధూకుడు చూసిన తరువాత ఒక్కమారి అయోమయంలో పడిపోయినాను—ఏది దారి?— అంతటితో ఊరుకుంటాడా? పెచ్చు మీరిపోయి—రెక్క పట్టుకు వాకిట్లోకి ఈడ్చివేస్తే— నేను ఏంకావాలి?

అనుకున్నంతా అయింది-గెంటడం తరువాయి—కాని: మామరది-ఆయన్ను మా అన్నయ్యే సలహా అడిగాడట. ఏం చేయాలని—అవును, గొర్రె కటికవాణ్ణే నమ్ముతుంది!—అడ్డుపడి, ఏదో హితబోధచేసి—అన్నయ్య మూర్ఖం విడవకపోవడంచేత—తానే ఖర్చులన్నీ భరించే పద్ధతి మీద—ఆ రాత్రికి రాత్రే—పట్నం బండికి పంపించాడు:

రైలు దిగగానే—నన్ను తీసుకువెళ్ళడానికి స్టేషనుకువచ్చిన దొరసాని వెంట ఆస్పత్రికి వెళ్ళాను. మా మరది—వాళ్లకు, నేను బండి ఎక్కగానే టెలిగ్రాం ఇచ్చాడట....

మళ్ళా ఏడు నెల్లకు...ఇవతల పడ్డాను....నా బంగారు తండ్రిని వాళ్ళు...ఏం చేసుకున్నారో...ఎవరికి పెంచుకోనిచ్చారో....భూమి మీద పడగానే....వాడికీ నాకూ ఈ జన్మకు రుణం తీరిపోయింది!

ఎల్లకాలం....వాళ్లు మాత్రం ఉండనిస్తారా? నాకు మళ్ళా మా ఊరు వెళ్ళాలంటే....మొగం చెల్లడంలేదు, ఎప్పుడు బయలుదేరుతావని అన్నయ్య ఉత్తరం వ్రాశాడు...నేను మెదలకుండా ఊరుకున్నాను. అప్పుడు. ఆయన స్వయంగా వచ్చి...తీసుకువెళ్ళి యింట్లో దిగవిడిచాడు.

వదినె....నెల్లాళ్ళ క్రితమే పిల్లనెత్తుకుని వచ్చింది. అన్నయ వెళ్ళి భారసాల చేసుకుని—నెల వెళ్ళకముందే—తీసుకువచ్చాడట. వచ్చానా—నాతో—, మావాడూ మాట్లాడలేదు—సరే, మా వదినెనన్ను చూడగానే మొగం పక్కకు తిప్పుకుని గదిలోకి వెళ్ళిపోయింది. చెప్పరానిదానికన్నా కనాకష్టం అయిపోయారు—తెల్లవారి లేవగానే కంటబడితినాయెనా, ఇద్దరి ముఖాలూ మటమటలాడిపోయేవి. అయితే అన్నీ అమర్చి పెడితే—విస్తరి ముందుకువచ్చి—ఎంచులు పెడుతూ—అన్నీ భోంచేయడానికి—అప్పుడు మాత్రం—ఏ అడ్డంకులేదు: అందుకు పనికివస్తాను.

నా మీద దయదలచి ఉంచుకున్నారా? చాకిరీకి మనిషి తేరగా అమిరింది గనక—ఏలాగో సరిపెట్టుకుంటున్నారు. మా వదినె—ఆ రాణీ-అసలు మంచినాడే అంతంతాయెను—ఎన్నడూ అవతల చెంబు ఇవతల పెట్టిన పాపాన పోయిందా—అందులో, బాలింతరాలు? అన్నయ్యకు ఆవిడ కాలు క్రింద పెడితే ఎక్కడ అరిగిపోతుందోనని—ఎంత భయం?

నేను—బాలింతరాలినే కదూ—కాని—నా ముద్దుముక్కలు చేసేది ఎవరు? ఆమాట తలవడానికైనా ఉందా? ఒళ్లు భారకించినా—ఎంత ఓపిక లేకపోయినా—వేళకు లేవకుండా, కొంచెం బద్ధకించి మూలిగానో,

ఇక అవి దెప్పుళ్ళుకావు—సాధింపులుకావు—నా తల్లో గుండెచిట్టెం కట్టి పోయింది. ఎంతకైనా తలఒగ్గవలసిన దాన్నే కా :

'నాకంట నరుడు పడరాడు. నరుడి కంట నేనుపడరాదు'—ఇలా రెండు నెలలపైగా—రాణీవాసమైపోయింది నా బ్రతుకు. వెలుపల సావిడి లోకైనా వచ్చేదాన్నికాను. అన్నాళ్ళూ గడప దిగితే ఒట్టు !

ఇక, లోకం—

పాడులోకం—వేలువంచడానికి సందుదొరికితే ఊరుకుంటుందా ? గోరంతలు కొండంతలు చేసి, దుయ్యపట్టుకోకమానుతుందా ? ఒక కంట్లో సున్నం—రెండోకంట్లో కారం—

అన్నయ్యకు—పరమయోగ్యుడికి ఇంత కష్టం వచ్చిందా ?అయ్యో పాపం—అని ఊరడించింది.

ఇంతకూ కారకురాలినికదా అని — ఈ కులనాశకురాలిని పడ దిట్టింది !

తిడుతూన్న ఆ నాలికే—మామరిది—మహానుభావుడు, ఆపత్తులో అడ్డపడ్డాడని—ఆయన్ను అందలాన పట్టింది : అయినా, అది ఎంత వరకు నిజమోలే—నోరు మాటాడుతూంటే నొసలు వెక్కిరిస్తూన్నప్పుడు—దేన్ని నమ్మడం ?

ఇలా— ఈ అగచాట్లమారి బ్రతుకు—ఎప్పటికి తెల్లవారనూ అని నాగుండెల్లో రాయిపడింది. కాని, ఇంతలో ఏం జరిగిందనుకున్నావూ—

మా జానకికి—నెలలు నిండాయి. సుఖంగానే చెంబెడు నీళ్ళు పోసుకుని—తల్లి పిల్లవాడూ గట్టెక్కి ఇవతల పడ్డారు. నక్షత్రదోషం ఏదో రవంత ఉందట, పోవడానికి నూనెలో మొగం చూసుకున్నారు.

నేను రానన్నా, ససేమిరా కాదు కూడదని, పట్టు బలవంతాన పిల్చుకెళ్ళారు.

మా అమ్మడు పీటలమీద కూర్చుని ఉండగా, చూడముచ్చటై ఒక్కమారు చెయి తీరికచేసుకొని, గుమ్మంలోకి తొంగిచూశా—ఎన్నాళ్ళయిందో దాన్ని చూసి—

అది నావంక చూసేసరికి—ముఖం వెనక్కు లాక్కున్నాను. దాని కంట పడలేక పోయినాను.

ఆశీర్వచనాలైన తరువాత—పాపణ్ణి పొత్తిళ్ళలో పొదివి—నా దగ్గరికి తీసుకు వచ్చింది జానకి. నేను తలుపుకు చెయిబార జాచి, జారగిలబడి....కంట నీటి బొట్టు పొడమకుండా, పళ్ళు బిగివిని నిలుచుని ఉన్నాను. నా వాలకం ఏం కనిపెట్టగలదు—పిచ్చపాడగట్టు—పిల్లవాణ్ణి నా చేతుల్లో పెట్టబోతూ—'వెళ్ళు నాయనా—అమ్మ !— చూడవే—నిన్ను చూసి నవ్వుతున్నాడేవ్ అక్కయ్యా !—ఇక నిన్ను వదలడేమోనేవ్—తీసుకోవే—పోనీలే నేను పనికిరాకపోతే—మీ అమ్మ దగ్గరికే వెళ్ళు బాబూ—' అని తన ఉబలాటం కొద్దీ—ఏమేమో పలుకుతూంది. నాకు—ఏలా ఉందని చెప్పనూ ?—

పక్కను చోద్యం చూస్తూఉన్న పెద్ద ముత్తైదువ ఒకావిడ—'అవునే, జానకీ—వీడిని మీ అక్కయ్యకు ఇచ్చేసి—నీవు ఇంకోకొడుకును కనుక్కోవే—' అని—ఆమెకు తోచినట్లు—హాస్యమాడింది. వింటూన్న వాళ్ళు, నవ్వారు : నా మనసులో భగభగమన్నది....జాస్తూన్న చేతులు వెనక్కు నెట్టుకుని....నీరోడుతున్న కళ్ళతో వెనక్కు తిరిగాను : అందరి పాయసాల్లోనూ నెయ్యి ఒలికినప్పుడూ.... నావంతుకు దక్కేది....పచ్చి విషమేనా ?

కంట్లో నిప్పులు పెట్టుకుంది....చూసి ఓర్చే నేర్పుకూడానా...."
జానకి.... మా జానకే.... ఈ మాటలు.... నా వెనకాల అన్నది....అనసీ. నిండా మునిగిన వాళ్ళకేంచలి ?

అంతటితో ఆకాంద అయిపోయింది : అన్నం నోటికి పోలేదు : మెతుకు ముట్టకుండా....ఊరికే విస్తరి ముందర కూర్చుని లేచాను. దాని కేంలే, కడుపునిండే ఉంది కాదూ, ఇవన్నీ చూసుకుంటూ :

ఓ విధంగానా, నాకు వంచన ? పులిమీద పుట్రరేగింది ! రాత్రి భోజనాలైన తరువాత, ఒంటిపాటున....మా మరది నాకు, అడ్డంవచ్చాడు. మరి, అధమం ఏ మూడు నెలలైనా.... గదిలో పక్క వేయించుకునేందుకు వీలులేదుగా.... ఎదురుగుండా నేను కనబడుతూంటిని. ఊరుకో వలసినంత కర్మం ఏంవచ్చింది ? ఒకమారు లోకువైన తరువాత....ఇక ....ఛీ....మగపురుగులు !

ఎంత స్వాతంత్ర్యంతో నాచెయి పట్టుకున్నాడనుకున్నావు ! ఊరుకున్నాను ! ఇంకా ముదరనీ....

రెండో చెయ్యి....నా భుజంమీద వేసి.... మెడ మీదుగా వాల్చి నన్ను దగ్గిరకు లాక్కునే....గృహస్థ మార్గంలో.... ఉన్నాడు.

జానకి....గుమ్మంలోకి వచ్చింది. మమ్మల్ని చూసి.... గుడ్లు వెళ్ళ కొచ్చి....తూలుతూ వెనక అంగవేసి....తలుపు ఠపీమనిపించి, లోపలపడి కెవ్వుమన్నది.

—మా ప్రబుద్ధుడు, తన ధోరణిలో తానున్నాడు కాని....వెనుకా ముందూ చూడటం వుందా ? రానిచ్చాను....మెదలకుండా....అసహ్యించుకుని ముఖం తిప్పేసు కోకుండా....మరీ దగ్గరకు రానిచ్చాను. మా యిద్దరి పెదవులకీ, నూలు వాసికూడా ఎడంలేదు. అందాకా వచ్చిన తరువాత,

పిడికిలి ఇనుపగుండు లాగాచేసి, ఎగువకు, గురిగా పళ్ళు కరుచుక పోయే ట్టు, గడ్డం చెక్కలయేటట్టు.... పిరగబొడిచాను. తగిలీ తగలడంతోనే, మళ్ళా కిక్కురుమనకుండా, చాపచుట్టగా పడిపోయినాడు....మా మరిది.... అంత సత్తువ ఎక్కడి నుంచి వచ్చిందో నాకు ః

వెనక్కు తిరిగి చూడకుండా....దూసుకువచ్చి....చూడకుండా రావ డంలో....పారిజాతం చెట్టు మీదపడి, లేచి.... ఏలాపోయి పడ్డానో, మా యింటిదగ్గర పిలవగా, పిలవగా ఓ పట్టుకు, మా వదినె—పమిటె సర్దు కుంటూ—వచ్చి తలుపుతీస—నిలవకుండాపోయి, గది తలుపు గడియ వేసుకున్న ది—నాకు, ఊరిన పుండుమీద ఉప్పూకారం చల్లినట్టయింది— అందరికీ నేను భారమే!

అప్పటికి ఈ ఆలోచనలేదు సుమా. మతిచెడి...మనస్సంతా పాడైపోయి క్షోభపడుతూ.... సావడి నాలుగు మూలలా కలయ దిరుగు తుండగా.... వంకెగా, బరువుగా.... అన్న య్యకోటు.... జేబు కనిపించింది. చూడగానే....అప్పుడూ, ఈ ఆలోచన తోచింది....చూస్తూన్నకొద్దీ అది పాతుకుపోయింది. ఒక్క క్షణం ఇక ఆలస్యం చేయకుండా, పర్సుమెల్లిగా తీసి....కావలసినంత అందులో ఉందోలేదో చూసుకుని, చేతబట్టుకుని.... పిల్లిలాగా అడుగులో అడుగు వేసుకుంటూ, ఆ యింటికీ....యింటి వాళ్లకూ....అంతటితో ఋణం తీర్చుకుని....వచ్చేశాను.

ఎవరికంటా పడకుండా....రైల్లోపడి....రెండుసార్లు. ఎక్కడ మారాలో తెలియక, దోవతప్పి....వెనుకాముందూ అయి....చివరకు ....ఇవాళ అసుర సంధ్యలో....ఇక్కడదిగాను.

దిగి యకాయకిని వచ్చేశానమ్మా! నాలిక పిడచ కారిపోతూంది! మా గంగమ్మ తల్లిని చూడంది....పచ్చినీళ్లన్నా ముట్టకూడదనుకుని.... తీర్థోపవాస ఫలం దోవలోనే దక్కించుకు వచ్చాను:

చిరుకెరటాల మీదు....అనుమానాలన్నీ ఒడ్డుకు పరిగెత్తిస్తున్నావా? నాకు అంతమాత్రం తెలియదనుకున్నావమ్మా! చెప్పనా?

మా మరిదిని ఎందుకు లోబరచుకున్నాననా? నా కోసంకాదు. ....నా చెల్లెలికోసం: వెలిరుచులు మరిగి, ఇకదానికి దక్కకుండా పోతా దేమోనని....దానిజీవితం ధ్వంసం కాకుండా, నన్ను బలియిచ్చుకున్నాను: నాకే కోరికఉండి, చెడి పోవాలనుకుంటే....ఆ ముసలితాతేనా....దొరికింది. దేశం గొడ్డుపోయిందా? తనను వలచి వచ్చాననుకున్నాడు....యిష్టం వచ్చి నప్పుడల్లా....లోకువ చేసుకోగల....ప్రజ్ఞ ఉందనుకున్నాడు....పాపం.... పిచ్చిబ్రాహ్మడు: ఆజన్మ అంతేలే! బుద్ధి వచ్చిందంటావా, ఏమో నాకు నమ్మకం లేదు: బుద్ధే ఉంటే. నీతి నియమం అనేదే ఏ మూలైన ఉంటే చేసిన పాడుపని ఆసరాతో ప్రతిష్ఠ సంపాదించు కునేందుకు పెనగులాడు తాడా?—కన్ను తెరవని పసికూనను కటిక వాళ్లకు అప్పగించనిస్తాడా?

జానకి....నేను విరగడైపోయిందే చాలునని.... సంతోషిస్తుంది? పోనీలే, నామీద జాలితలవడం....నాకోసం బాధపడడం కన్న....ఇదే మంచిది: నామీద కోపం అల్లా దానికి మొగుడిమీద ప్రేమను పుట్టిస్తుంది. మ్రానిపళ్ళు అందుబాటులో లేకపోయినకొద్దీ....మెడ మరీ సాగుతుంది: ఇంకొకరికి దక్కి పోతున్నాడని తెలిసి నప్పుడుకాని, ఆడదానికి...మగ వాణ్ని తానే సర్వాపోశనం పట్టాలనే తహతహ పుట్టదు; అలా జరి గిందో... అంతకన్నా నాకు మరి కావలసినదేముందీ?

కన్న తరువాత...నెలలు మోసినందుకు ఫలం దక్కకుండా చేజారి పోయిన తరువాత కాని...కడుపు తీపంటే ఏమిటో తెలియ లేదమ్మా. పోనీలే...ఒంటరిగా మాయమై పోవడంకన్న, తీరని కోరిక లన్నీ, వెంట తీసుకు వస్తున్నాను! అదీ కొంత మేలే కాదూ?

ఎవరిమీద పగ సాధించను...ఎన్నింటికని ఏడ్వను...నాకు లేకపోయినా...ఇంకోరన్నా...నా మూలాన కుదటపడి బాగుండడమే పదివేలు!

అన్నయ్య అంటావా—'పోయి గంగలో కలవనీ—దానికిలాటి విపరీతపుబుద్ధి పుట్టినప్పుడే అది మాకు కానిదై పోయింది'...అని మొండిగా అనేస్తాడు : ఒకవేళ...అనలేక ఊరుకున్నా, నేర్పునెరజాణ, మా వదినె ఉండనే ఉన్నదిగా!

నేను ఎవడి వెంటనోపడి దేశాలుపట్టి పోయినాను అనుకుంటారు ...అంతేకాని...వాళ్ల నోటివాక్యమే ఫలిస్తూన్నదని...ఏలా అనుకో గలరు?

ఇక...వాళ్లెవరికీ నేను కలలోనైనా కనపడను కాదూ—

'నీది ఇంత దొడ్డమనసా' అని ఆశ్చర్యపడుతున్నావా? నీ వొక్కతెవేనా, మరి, ఈ ఏడేడు పధ్నాలుగు లోకాల్లోనూ?

మీ చెల్లెలు పార్వతి కోసం...మహేశ్వరుడితోటి నీవు ఆడిన నాటకమే— నేనూ వర్ణించానమ్మా: నిన్ను చూసి నేర్చుకున్నదేనమ్మా.

మన ఇద్దరి మనసూ ఒకటి. మనకోరికలు ఒకటి. మన ఇద్దరి పేరూకూడా ఒకటే...అందుకనే...నిన్ను వెదుక్కుంటూ వచ్చానమ్మా.

— మల్లాదిరామకృష్ణశాస్త్రి

# కళ

మానవునికి సౌందర్య సంవీక్షణమువలనకలుగు ఆనందముప్రకృతి సిద్ధమైనది. నిండు పున్నమనాడు పడమటి కాంత యొడిలోన పవళించి యుండు నెలబాలుని తిలకించినప్పుడు కాని, ఆకులు రాలక పూలువాడని ఆరామమందు "చిలకపోటులచేత జెరగిన సహకార ఫలముల" నుండి స్రవియించు పచ్చి తేనెను పరికించినప్పుడు కాని. మరియెట్టి మనోహర దృశ్యమును గాంచినప్పుడు కాని, మన హృదయములయందు సౌందర్య సాక్షాత్కార మగుచుండును. విద్యాధికులకు విజ్ఞానులకు, విద్యావిహీను లకు, అజ్ఞానులకు, శ్రీమంతులకు. నిరుపేదలకు స్త్రీలకు పురుషులకు, బాలురకు అందరికిని కొలదియో, గొప్పయో సౌందర్యశక్తి యుండి తీరును. మానవునకు సౌందర్యమునందున్న సహజమగు ప్రేమయే అతడు లలితకళల నారాధించుటకు ప్రోత్సాహ కారణమని చెప్పవచ్చును. మాన వుని హృదయమున యెచ్చటనో దాగియున్న సృష్టిశక్తి పైకుబికి వచ్చి ఏదో యొకరూపముదాల్చుటయే లలితకళ అవిర్భావమని చెప్పవచ్చును. లలితకళలు సౌందర్యపు భావచిత్రములు కావున కళ స్వభావమును గుర్తించినపుడే మనము సౌందర్య దర్శనము చేయగలుగుదుము.

ప్రపంచము నందలి ఏ గొప్పకళనైన తిలకించుడు ; అది ఒక ప్రత్యేక వ్యక్తి నిర్మాణమని విశదమగును. అట్లగుటచే ఒక కావ్యముగాని ఒక చిత్రము కాని ఒక భంగిమకాని సరిగా పూర్వ సంప్రదాయమునే అనుసరించి, ఇదివరకున్న వాని వలెనే యుండి, ఒకే యంత్రము నుండి తయారుచేసిన నాణెములవలె నుండుట సంభముకాదు...ఒక క్రొత్త జీవ

కళ, ఒక క్రొత్తచైతన్యము కలిగినదే నిక్కమగు కళయని చెప్పవలసి యుండును. పాతపాటలే తిరిగి పాడిన రోతగా నుండదా! ఉద్రేకము కవిత్వమునకే కాదు—సౌందర్య ప్రధానములగు కళలన్నింటికిని జన్మ స్థానమని చెప్పవచ్చును. కవివలె చిత్రకారుడు కూడ భావనావీధులందలి తన యనుభవములను వర్ణముల రూపమున ప్రదర్శించుచుండును.

లలితకళల లక్షణములను వివరించుచు సిద్ధాంతములను ప్రతి పాదించు గ్రంథము లనేకము కలవు. కాని ఈ సిద్ధాంతములను మాత్రమే నమిలి మ్రింగుట వలన యెవరికిని నవనవోన్మేష శాలినియగు ప్రజ్ఞ లభింప జాలదు. సహజ ప్రతిభ పరిపూర్ణముగా అభివృద్ధి నొందుటకు దోహదము మాత్రమే కావించునవి లక్షణ గ్రంథములు—సంప్రదాయము. కళను సమ కాలిక సాంఘిక పరిస్థితులతో సమన్వయించి ఆ రెండింటికి సమరస భావము కలిగించునది మాత్రమే! ఒకకాలమున అత్యుత్తమముగా పరి గణింపబడిన సంప్రదాయము మరియొక కాలమున పనికిరాకపోవచ్చును. కావుననే కాలముతోపాటు సంప్రదాయములు మారి జాతీయ పున ర్వికాసము జరుగుచుండును. కళాసౌందర్యమును ప్రతిపాదించు యే యొక్క సిద్ధాంతమునుగాని మనము ఆ విషయమున తుది మాటగా అంగీకరించుట పొసగదు. సర్వకాల సర్వావస్థలయందు కళా సౌందర్యమును ప్రతి పాదించు ఆదర్శ మిది యొక్కటేయని యెవ్వరును వ్రేలెత్తి చూపజాలరు. అట్లయినచో అభివృద్ధియను మాటయే మన శబ్దకోశమునుండి అంతరించ వలసి యుండును. ఒక కాలమునందు ఒక గొప్ప కళోపాసకుడు నిర్మిం చిన కళాశకలమును అచ్చుగ్రుద్దినట్లు మరల మనము తయారు చేయజాలము. అట్లు చేయుట కళ కాదు; చేసినను అది యొక నమూనా మాత్రమే యగును. అందు కళా సౌందర్యము లోపించితీరును. ప్రత్యేక వ్యక్తిత్వము

వైలక్షణ్యము కలిగిన నిర్మాణమే కళోపాసకుల ఆదర్శము. బింబములను ప్రతిబింబములను తయారు చేయుట కళోపాసకుల పనికాదు.

కవిత్వము లలితకళలలో ప్రధాన స్థానము నాక్రమించును— కవిత్వమునకువలె ఇతర లలితకళలకును కారణభూతములగు విషయములు రెండు—మొదటిది భావచిత్రము, రెండవది భావచిత్రములను హృదయ ఫలకములందు ప్రదర్శించు మనోవికారము. కావ్య ప్రపంచమున వ్యక్తుల భావచిత్రములు, వివిధ వస్తువుల దృశ్యముల భావచిత్రములు, మానవుని సుఖదుఃఖముల భావచిత్రములు, మున్నగునవి ప్రదర్శితము లగుచున్నవి. ఈ భావ చిత్రముల వెనుక కవి యొక్కనివే కాదు. పాఠకుల మనోవికారములు కూడ గోచరించు చుండును. దుస్సహ దుఃఖాను భవములు, కంటికి నీరుదెచ్చి హృదయమును కరగించు కరుణ రస ప్రపూర్ణములగు ఘట్టములు, పరమాత్మతో లీనమగుటకు అంతరాత్మ పడు ఆవేదన మున్నగు మనోవికారములతోపాటు "దాటిపోయిన యుగముల" నాటి చరిత్ర యొక్క భావచిత్రములను లలిత కళలు మనయెదుట ప్రదర్శించుచున్నవి. కార్యకారణ క్రమమున వివరింపరాని అనిర్వచనీయ మాధుర్యము సౌందర్యానుభూతి కవిత్వము మన కొసగుచున్నది. భావ చిత్రములను, మనోవికారములను కళా ప్రపంచమున వేరుపరచుటకు వీలులేదు. ఈ రెండు శక్తుల సరస సమ్మేళనమే కళా సౌందర్యము. ఈ రెండు శక్తులుగాక కళా ప్రపంచమున అనేక యితర విషయములు కూడా సౌందర్య దర్శనమునకు సహకారులు కావచ్చును. ఈ సందర్భమున కళా వస్తువు చారిత్రకముగా గాని ఇతరత్రముగా గాని యథార్థము కావలసిన యవసరములేదని మనవి చేయుట ఆవశ్యకము.

ఒక ఛాయా చిత్రమును పరికించుడు-అది ప్రపంచమునందలి యొక మానవుని యొక్కగాని వస్తువుయొక్కగాని ప్రతిబింబము. ఈ

ప్రతిబింబము కళాశకలము గాజాలదు. కేవలము వివిధవర్ణముల విచిత్ర సమ్మేళనము కళ కాజాలదు. అట్లే వివిధ ధ్వనుల సమ్మేళనము కూడ సంగీతము కాజాలదు. అదియే సంగీతమైనచో గాయకుడు కానివాడుకూడ సంగీతమును రచింపవచ్చును. తుట్టతుదకు వివిధ ధ్వనులను సాధ్యమైనన్ని విధములుగా సమ్మేళనము చేసిన తరువాత, వివిధ శబ్దములను సాధ్యమైనన్ని విధములుగా సమ్మేళనము జేసిన తరువాత సంగీతము, కవిత్వము ఈ ప్రపంచమునుండి శాశ్వతముగా నిష్క్రమించవలసి వచ్చును. కావున బాహ్యస్వరూపమునుగాంచి, శబ్దవర్ణ ధ్వనుల సమ్మేళనము గాంచి; అదియే నిక్కమగు కళయని భ్రమించుట ప్రమాదము. కళా సౌందర్యమును ప్రతిపాదించు భావచిత్రములు, మనో వికారములు లేనిది అది కళ యెన్నటికిని కాజాలదు. కవితారసపిపాసువగు పాఠకుడొక గ్రంథమును పఠించునపుడు శబ్దజాలముయొక్క ఇంద్రజాలముతో సంతృప్తిపడక అందలి కావ్య సౌందర్యమును తనివిదీర యనుభవించును. మేధాసంపద, యుక్తివాదము, వివిధ విషయ పరిజ్ఞానము ప్రపంచమునకు పరమోపకార మొనరించుట నిస్సంశయమే. కాని రస పిపాసువునకు సౌందర్య సాక్షాత్కారముక లిగించుశక్తి మాత్రము వానికి లేదు." హృదయశక్తిలేని మేధాశక్తి, సౌందర్యములేని విజ్ఞానము, భార్యలేని భర్త సంసారము వంటివి. ఈ సత్యమును కళా సౌందర్యమును తృణీకరించు శుష్క హృదయులు గ్రహింపవలెను.

కళ తత్వ శాస్త్రము కాదు; కళ చరిత్రకాదు; కళ భౌతిక శాస్త్రము కాదు. గాలిలో మేడలు కట్టుట కళగాదు. భౌతిక శాస్త్ర తత్వశాస్త్రముల వలె యుక్తి వాదముపై అధారపడకున్నను, చరిత్రవలె గత కాలములో జరిగిన సంగతులను గ్రహించునది కాకపోయినను, కళ యందుకూడ ఒక ప్రత్యేకమగు క్రమము, విలక్షణమగు సత్యము గోచరించుచుండును.

అస్పష్టమై, క్రమబద్ధముగాక చెల్లాచెదరై యున్న మనోవికారములకు విశిష్టము క్రమబద్ధమునగు స్వరూపము నొసంగుటయే కళ ప్రత్యేకత; ఆకాశ హర్మ్యములను నిర్మించునది గాక ప్రతిభావంతమగు సృష్టిని గావించునది కళయని మనము గ్రహింపవలెను.

మనయందరికిని మనోవికారములు కలుగుచుండును. మనము సంతోషించెదము; దుఃఖించెదము; కోపించెదము; దయార్ద్రహృదయుల మగుదుము. ఆ సందర్భములందు అప్రయత్నముగా మననోటినుండి శబ్దజాలము ఉలికి వచ్చును. కాని యీ మాటలు కవిత్వము కాజాలవు. కవియగువాడు తన మనోవికారములను ఏకముఖము గావించి క్రమబద్ధముగా వ్యక్తీకరించునప్పుడే అది కవిత్వమగును; అందు సౌందర్యము ప్రతిఫలించును.కాని నోటికి వచ్చినమాటలన్నియు కవిత్వము కాజాలవు.ప్రతిభాశాలియగు వ్యక్తిచే ప్రశాంత సమయమున సంస్మరణమునొంది వ్యక్తమైన భావములే కళాసౌందర్యమునకుఅటపట్టులనియొక విమర్శకుని అభిప్రాయము కావుననే మన హృదయములందు కలుగు మనోవికారములు తాత్కాలికములే. కవిత్వము నందలి మనోవికారములు విశ్వజనీనములై, యొప్పుచుండును, అనేకులు పుత్రశోకము ననుభవించుచున్నారు. ఆ సందర్భములందు మనోవికారము లెన్నియోరీతుల ప్రదర్శించుచున్నారు. ఈ ప్రదర్శనములు, ఈ ప్రలాపములు తాత్కాలికములు మాత్రమే. కాని కళయందలి శోక మట్టిదికాదు; దానికొక శాశ్వతత్వము కలదు. దీనినే కళకు సంబంధించిన విశ్వజనీనత యని చెప్పవచ్చును. కావుననే కవి వ్యక్తీకరించిన శోకము, సంతోషము, కరుణ, వేడుక, వేదనలు ప్రత్యేక వ్యక్తిత్వము కలిగి విశ్వజనీనములై యొప్పుచున్నవి. ఒకేయొక భావమును ప్రదర్శించుకళ కొంత వెగటుకలిగించవచ్చును. వైవిధ్యము కళ అందమును ద్విగుణీకృత మొనరించును. కావుననే కాబోలు మన

వారు కావ్యమునందు అష్టాదశవర్ణనాదు లుండవలెనని విధించి కావ్య వస్తువును విశాలపరచినారు.

కళ ముఖ్య కర్తవ్యము ఉపదేశము. ప్రచారము అనుశాసనములు కావు. ఉపదేశము, ప్రచారము, అనుశాసనము అంతర్వాహినులుగా నుండ వచ్చును. కవిత్వమును కాంతా సమ్మితముగా గ్రహించిన మన ప్రాచీనులు యీ సత్యమును చక్కగా విశదీకరించినారు. మానవ జీవిత విమర్శనమే కళకు ముఖ్య ప్రతిపాదకమగు విషయము.

కళా సౌందర్యమునకు కేంద్రస్థాన మేదియను ప్రశ్న స్వాభావికముగా కలుగుచున్నది. ఒక చక్కని అజంతా చిత్తరువును తిలకింపుడు— ఆ చిత్రము ఒక్కొక్క మానవునియందు అతని సంస్కృతి ననుసరించి ఒక్కొక్క విధముగా సౌందర్యానుభూతి కలిగించును. కొందరిని రవివర్మ పటములే యెక్కువగా ఆకర్షించుట జూచుచున్నాము. కావున కళా సౌందర్యమునకు ఆటపట్టులు మనహృదయములేయని చెప్పుట మిక్కిలి సమంజసము.

పటమునందలి వర్ణములు, రేఖలు మున్నగు సాధన సామగ్రి మాత్రమే కళాసౌందర్యమున కాటపట్టులు గావు. అర్థశాస్త్ర ప్రపంచమున ఇవి యుపయోగకరములగు వస్తువులు ఇవి కావు-అని స్పష్టముగ నిర్దేశించలేని విధముగనే కళా ప్రపంచమున గూడ "ఇవి సుందరమగు వస్తువులని" మన మొక కడపటి నిర్ణయము చేయజాలము. అర్థ శాస్త్రమున అవసరము, సరఫరా మున్నగు విషయాలు వస్తువుల యుపయోగమును నిర్ణయించిన విధముగనే రసికుల మనోవృత్తి కళా ప్రపంచమున సౌందర్య నిర్ణయము గావించుచుండును.

మనము కావ్యములను శృంగార కావ్యములు, వీర కావ్యములు అని వివిధములుగా విభజించుచున్నాము. ఇది మన సౌలభ్యమునకై చేసికొనిన

విభజనమే కాని కావ్యసౌందర్యమును కొలిచి చూపు మానదండముకాదు. శాస్త్ర ప్రకారముగా ఒక కావ్యము సర్వలక్షణ సమన్వితమై యుండ వచ్చును ; కాని సౌందర్యము సంపూర్ణముగా లోపించవచ్చును. వ్యాకర ణము, అలంకార శాస్త్రము, సాహిత్య శాస్త్రము, మున్నగునవి రచనా సూత్రములను బోధించి భాషా సంప్రదాయములను తెలుపుటకు సహ కారము చేయును గాని కళ అంతరాత్మను చూపించ జాలవు. కళా సౌందర్య మునకు పరమ ప్రమాణములు రసికుల హృదయములు మాత్రమే.

—శ్రీ దేవులపల్లి రామానుజరావు

# ఆంధ్రుల సాంఘికాచారములు

భారతదేశంలో భావైక్యతను క్రొత్తగా నెలకొల్పి, తద్వారా జాతీయ భావమును పెంపొందించ వలెనని తలచువారు నేడు పెక్కుమంది కాన్పింతురు. ఇటువంటి భావైక్యత శతాబ్దులనాటి నుండీ దేశంలో వ్యాపించిఉందని వీరు గుర్తించాలి. దాని అంతర్యం ఏమిటో, అది దేని మీద ఆధారపడి ఉందో అది కూడా చక్కగా పరిశీలించి తెలుసుకోవాలి. సాధ్యమైనంతవరకూ దానికి దోహదంచేస్తూ వెళ్ళడమే విజ్ఞత అవుతుంది. కొందరు దీనికి విరుద్ధంగా ఆలోచిస్తారు. దేశంలో ఇదివరకుండిన భావైక్యత నామమాత్రమైనది. ఇంతేకాక అది వర్గపీడనము మీద ఆధారపడి నిల్చిఉంది. అందుచేత దానిని విచ్ఛిన్నముచేసి, శాస్త్రీయము, ఇతోధిక మానవతాభావపూర్ణము అయిన వ్యవస్థను ప్రచరితం చెయ్యా లంటారు. హేతువాదమునకు ఈ యాలోచనాపరంపర నిలువ గలిగి ఉన్నను అది యెంతవరకు ఆచరణ సాధ్యమో కాలమే నిర్ణయించాలి.

భారతజాతీయైక్యతకు మూలము అన్ని రాష్ట్రములందును ఒకే విధమైన సాంఘిక వ్యవస్థ, ఆచార వ్యవహారములు వాడుకలో నుండుట యని చెప్పవచ్చును. ప్రస్తుతము ఆంధ్రదేశము నందలి ఆచార వ్యవహార ములను పరిశీలిద్దాము. పాశ్చాత్య సభ్యతపై ఆధారపడిన నూతన భావ ములు దేశమునందు ఇప్పుడు వ్యాపిస్తున్నాయి. ఒక తరానికి ముందు పూర్వపు సాంఘిక వ్యవస్థ తాలూకు ఛాయలు దేశంలో బాగా కనపడేవి. సాంఘికాచారాల్ని యథాతథంగా తెలుసుకోవాలంటే సంఘంలో కనబడే వివిధ వర్గాలను గుర్తుంచుకోవాలి. ప్రధానంగా బ్రాహ్మణులు మున్నగు

అగ్రవర్ణములవారు, మిగిలిన అవరవర్ణములవారు అనే విభాగం గమనించాలి. ఈ విభాగం మనకు ఇష్టమా, అనిష్టమా అనే ప్రశ్న ప్రకృతము అనవసరము. స్థితిస్యగతిశ్చింతనీయా అన్నట్లు ఉన్నదానిని గ్రహించాలి. వర్ణములవలెనే పురుషులు స్త్రీలు అనే వర్గాల్ని గుర్తించాలి. ఆర్య-ద్రావిడ సంస్కృతీ భేదములను గూడ మనము జ్ఞాపకం ఉంచుకోవాలి. మరొక పేరుతో వీటిని పిలవాలంటే ఆర్యాచారములు దేశీయాచారములు అని పిలవవచ్చును.

సాంఘికాచారములని చెప్పబడేవానినే పూర్వులు షోడశకర్మలూ లేక సంస్కారములు అనేవారు. వానిలో ముఖ్యమైనవి జాతకర్మ, నామకరణము, అన్న ప్రాశనము, చౌలము, ఉపనయనము, వివాహము, గర్భాధానము, అంత్యక్రియలు. వీటిలోకూడా ఉపనయనము, ద్విజులకు మాత్రమే వర్తిస్తుంది. స్త్రీలకును ద్విజేతరులకును ఈ బాధ్యత లేదు. స్త్రీల విషయంలో పుంసవనము, సీమంతము అను విశేషాచారములు కనిపిస్తున్నాయి. గర్భ చిహ్నములు కనబడగానే పురుష శిశువు కలుగవలెనని చేసే సంస్కారము, పుంసవనము. ఆఱవమాసమున గర్భిణికి చేసే శుభ సంస్కారమును సీమంతము లేక సీమంతోన్నయనము అని చెప్పుదురు. ఇప్పుడే గాజులు పెట్టించుట జరుగును. కొన్ని కుటుంబములందిది ముత్తైదువులకు పసుపు కుంకుమ తాంబూలము మున్నగునవి ఇచ్చుటతోనే ముగియును. గాజులు పెట్టించుట ఉండదు. మన సంఘమునందు ఆర్య ద్రావిడ జాతి జనుల కలయిక జరిగినదనుటలో విప్రతిపత్తి లేదు. కావున వారియాచారములును సమ్మేళనము చెంది ఒక నూతన సమన్వయ మేర్పడినది. మన సాంఘికాచారములన్నిటిలోను ఆర్యుల సంప్రదాయములును దేశీయ సంప్రదాయములును సమ్మిశ్రితములైనవి. ఆర్యాచారములు కొంతవరకూ సంస్కృతిచే ప్రసన్నములై ఉంటాయి. దేశీ

యాచారములందు మూఢ విశ్వాసముల పాలు అధికంగా కనబడుతుంది. ప్రసూతికా గృహములో చేయవలసిన వ్యవస్థను గూర్చి తెలుగుకావ్యములలో ఎన్నో వివరాలు లభిస్తాయి. ఇందులో కొన్ని ఆరోగ్య సూత్రముల మేఱకు పరంపరగా వచ్చేవి. కొన్ని ఆచారములు భూత ప్రేతాదులను పురిటి యింటి నుండి దూరముగా నుంచుటకై అనుష్ఠింపబడేవి.

వివాహమునందు ఆర్యాచారములు దేశీయ పద్ధతులు కలగలుపుగా కనబడతాయి. పాణిగ్రహణము, సప్తపది, సన్నెకల్లు త్రొక్కుట మున్నగునవి ఆచారములు. కావుననే వీటికి వైదిక మంత్రాలు ఉన్నాయి. మంగళసూత్రధారణము దేశీయాచారముగానే భాసిస్తూంది. దీనిని మంత్రములతో గాక శ్లోకములతో నడుపుతున్నారు. తాళికట్టుట అను సంస్కారము జనులలో బహుళవ్యాప్తి నందినట్లు కనిపిస్తూంది. క్రైస్తవ కుటుంబములు కూడ కొన్ని కొన్ని వధువునకు మంగళసూత్రధారణం చేయిస్తున్నాయి. వివాహము నందు పెక్కువేడుకలు దేశీయాచారములుగ వాడుకలో నున్నవి. బాల దంపతులకు అన్యోన్య ప్రేమ కలిగించడానికి ఎన్నో ఏర్పాట్లు ఉండేవి. బంతులాడుట (పూలచెండ్లు) తలుపుల దగ్గర పేర్లు చెప్పించుట, ఒకే కంచంలో అన్నముతినిపించుట, దండాడింపు మున్నగునవి. దండాడింపు అనునది వేడుక నృత్యము. పసివారైన వధూవరులను పెద్దవారు ఎత్తుకొని బుక్కాచల్లుచు నృత్యమాడుదురు. పెండ్లిలో దొంగవేలము అను నొక ముచ్చట కలదు. పెండ్లి కూతురు బావగారు (అక్కమగడు) మఱదలిని దాచిపెట్టును. అప్పుడు పెళ్ళికొడుకు వంకవారు పెండ్లికుమార్తె బావకు కట్నమిచ్చి నవ వధువును విడిపించుకొందురు. మరియొక అందమైన వేడుక ఐరేనికుండలకు సంబంధించినది. అయిరేని కుండలు మనోజ్ఞముగా రంగులు పూసిన పెండ్లికుండలు. బ్రాహ్మణేతరులు వివాహ తంత్రము నందు వీటి కెక్కువ ప్రాధాన్యం

ఇస్తూన్నట్లు కనబడుతుంది. ముత్తైదువలు ఈ కుండలు పట్టుకు వస్తారు. వీని ప్రయోజన మేమిటంటే—కుండనీళ్ళలో బంగారము వెండి వస్తువులు, ఉంగరము, మట్టెవంటివి వేసి నూతనవధూవరులచే తీయిస్తారు. వాటిని వెతకడంలో ఔత్సుక్యము కలిగి ఆలేత దంపతులు ఆనందం పొందుతారు. బంగారపు వస్తువు పట్టుకొన్న వారు గెలిచినట్లు. ఈ యాచారము బ్రాహ్మణులందును కలదు. నాకబలి నాడిది చేయించుచుండిరి. కుండలకు బదులు బిందెలు వాడుదురు. రంగు పూత గలిగిన చిన్న కుండలను వివాహమునందు నాకబలినాడు బ్రాహ్మణ కుటుంబములవారును అలంకరించు చుండిరి.

తలంబ్రాలు పోసుకొనుట మిక్కిలి ప్రాచీన కాలమునుండియు వచ్చుచున్న ఆచారంగానే కనబడుతూంది. "ముక్తా స్తా శ్శుభదా భవంతు భవతామ్ శ్రీరామ వైవాహికాః" అని చెప్పబడెను. అక్షతలకు బదులు జొన్నలు వాడుట కొన్ని కులములలో నున్నది. అరుంధతీ దర్శనము చేయుట ప్రాచీనాచారముగనే ఉన్నది. అత్యంత ప్రాచీన కాలముననే ఆర్యులు జ్యోతిర్మండలమును బాగుగా పరిశీలించిరనుటకు ఇదియొక తార్కాణము. మగపెళ్ళివారు వివాహమునకై తరలి వచ్చినప్పుడు పెళ్ళివారు వారిని సన్నాహముతో ఎదురుకొని ఆదరించి పెండ్లికి తీసుకు వెళ్ళుదురు. ఇవియే ఎదురుకోళ్ళు. వివాహములో చిట్టచివరి అంగము అప్పగింతలు. పెండ్లి కుమార్తెను అత్తవారి వంకవారికి పేరుపేర అప్పగించి నూతన వస్త్రములు బహూకరింతురు. ఈ సమయమునందు కన్నీరుపెట్టని గృహస్థుడుండడు. "వైక్లబ్యమ్ మమతావ దీదృశమహో స్నేహా దరణ్యౌకసః। పీడ్యంతే గృహిణః కథమ్ను తనయా విశ్లేషదుఃఖై ర్నవైః" అని కణ్వ మహాముని చెప్పినమాట అక్షరాల నిజము గదా. ఇవికాక బూజముబంతి వంటి వేడుకలు పెళ్ళిళ్ళలో ఎన్నో నడుస్తూ ఉంటాయి. నైషధంలో దీనిని వర్ణించారంటే చాల కాలంనాడే

ఏర్పడిన వేడుక అన్నమాట. వివాహంలో అంతా సంతోషమే గనుక ఎప్పుడో గృహస్థులయిన వారుకూడ నూతన కౌతుకమునకు లోనయి భోజనముల వేళ పిండి వంటలతో మొత్తులాడుదురు. పెండ్లిపాటలు వాటి హాస్య కరుణ సన్నివేశములు ఆదొక వెన్నెలజల్లు. ఈనాటి దుర్భర వ్యాపార నాగరకతయందు ఈ మహా సంరంభమంతయు తియ్యనికలగా మారిపోయినది.

పురుషులు నాడును నేడును బయటి జీవితమున కలవడిన వారే గనుక గృహ వాతావరణమునందు వారంతగా శోభించరు. అందుచేత సాంఘికాచారములన్ని చాలా వరకు స్త్రీలకు సంబంధించినవిగానే ఉంటాయి. పసుపు, కుంకుమ, పరిమళములు, రంగులు, అలంకరణములు, నగలు అన్నీవారి సొమ్ములు. శిశువు జన్మించిన పదనొకొండవనాడు బాల సారె అను ఆచారము నడుపుదురు. జన్మ నక్షత్రము శుభా శుభములను బట్టి నూనెలోనీడ చూచుట మున్నగు ఆచారములు లాంఛనముగానైనా ఇప్పటికీ ఉన్నాయి. పదకొండవ దినమునగాని, 21 వ దినమునగాని శిశువును తొట్టెలో వైతురు. ఈనాటి నుండియే శిశువు తల్లి చిన్న చిన్న యింటి పనులలో ప్రవేశించును. దీనికి గుర్తుగా కాబోలు స్త్రీలందరు బావి కడకు వెళ్ళి బాలెంతరాలిచే నూతిలో చేదవేయింతురు. ఇక్కడ ఒక మనోహరమైన ఆచారము వినవస్తుంది. జన్మించిన శిశువుయొక్క బొడ్డును తీసియుంతురట. అంతవరకును పిల్లలు పుట్టక మక్కువపడు చున్న కొమ్మలచే ఆ బొడ్డుతునుకలను తినిపించుటయో వాసన చూపించు టయో చేయుదురు. దీనిచే వారికిని సంతానము కలుగునని నమ్ముదురు. 'మీరు తినండంటే మీరుతినండనీ, మాకొద్దంటే మాకొద్దనీ' పూబోండ్లం దరూ పరాచికములాడుకొనుట విరబూచిన మల్లెపందిరిలా ఉంటుంది. మగపిల్లలకు పుట్టువెంట్రుకలు తీయింతురు. ఇదియే చౌలము కావచ్చును.

ఆడపిల్లలకును కొన్ని ప్రాంతములలో నీలాలు తీయుదురు. దేవుళ్లకు మీదుకట్టి తిరుపతి, అన్నవరం మొదలైన పుణ్యస్థలాల్లో జుట్టు తీయించుట జరుగు చుండును. ఆభరణాలు పెట్టుకోడానికి వీలుగా ఆడపిల్లలకు ముక్కులు చెవులు కుట్టించు మర్యాద నేటికిని కలదు.

ఉపనయనము ఆర్యాచారము. ఇది ద్విజులందరికిని వర్తించును. కాని బ్రాహ్మణులలో మాత్రము మొన్నటి వరకూ కన్పట్టుచూ వచ్చి ఇటీవల అక్కడకూడా గగన కుసుమము అవుచున్నది. ఆయావర్ణముల వారికి చెప్పబడిన వయస్సులో ఉపనయన సంస్కారమును పొంది, పచ్చ గోచీలతో, పాలాశదండములతో "భవతి, భిక్షాం దేహి"యని తల్లిని భిక్ష వేడు లేత బ్రహ్మచారులు కూడ మనోహర దృశ్యమే. ఇది కాళిదాసు వంటి మహాకవిని ఆకర్షించింది. "అథాజినాషాఢధరః ప్రగల్భవాక్' జ్వలన్నివ బ్రహ్మమయేన తేజసా". తొలిసారి వేదాధ్యయనము వటువునకు శ్రావణ శుద్ధ పూర్ణిమనాడు ఆరంభింతురు. ఇదియే జందెముల పూర్ణిమ. ఇది బహుథా లుప్తప్రాయమైన ఆచారము. ఇంక ఆడపిల్లల కెన్నియో శిక్షణలు ఉంటాయి. ప్రధానంగా అవి బాలికను గృహిణిగా దిద్దడానికి అవసరమయిన ప్రణాళికలు. పూర్వపు సాంఘిక వ్యవస్థలో సమష్టికుటుంబము సదాచారము. ఆడపిల్ల పొరుగింట జీవించవలసిన విధాయకము అన్నికాలములందును అన్నిదేశములందును కలదు. అది యొక అసిధారావ్రతము. దానిలో విజయం పొందడానికి రెండే ముఖ్యోపాయములు. ఓర్పు, మితభాషిత్వము. మితభాషిత్వము నేర్పడానికే కాబోలు మూగనోము అను విచిత్రాచారము ఏర్పడేంది. సూర్యాస్తమయ సమయమున, సుభగం కరణము పూర్తిచేసుకొని కుంకుమ బరణి అక్షతలు తీసుకొని బాలికలు పొరుగిళ్ళ ముత్తైదువుల వద్దకు వెళ్ళి వారిచే ఆశీతలు వేయించుకు వస్తారు. ఇది మాంగల్యము పెంపొందించుట

కొరకు. ఇంతసేపును ఆ పడుచులు పెదవికదపి మాట్లాడరాదు. పెద్దలైనవారు, కొంటెపిల్లలు వారి నియమ భంగం చేయించడానికై పలకరించినా, వారు మాట్లాడకూడదు. మూగనోము దీపావళి వెళ్ళిన మరునాటి నుండి కార్తీక శుద్ధ పూర్ణిమ వరకు ఒక పక్షము దినములు చేయుదురట. ఈ సందర్భంలో సూర్యాస్తమయ సమయమునందలి గ్రామీణ దృశ్యమును వర్ణించు మధురాతి మధురమైన జానపదగేయము కలదు.

పడమటా ప్రొద్దుల్లు గ్రుంకేటివేళ
ఆవుల్లు గోవుల్లు వచ్చేటివేళ
అతివలూ కడవల్లు ఎత్తేటివేళ
చాకింటిమడతలూ తెచ్చేటివేళ
బీరాయి పువ్వుల్లు పూచేటివేళ

ఇవికాక ఇంకను చిన్నచిన్న నోములు, నియమాలు బాలికలకు ఉంటాయి. అలసత్వము, బద్ధకము మొద్దు నిద్దుర మొదలైన వఆగుణాలు ఆడపిల్లలకు చెల్లవు. ఆ మాటకువస్తే అవి ఎవరికినీ తగవు. బాలికలు ఎప్పుడూ శుభ్రంగా అందంగా ఉండడం నేర్పడానికై కొన్ని నోములు ఉంటాయి. చిట్టిబొట్టు, ఉదయ కుంకుమ మొదలైనవి ఇట్లాంటివి. వ్రత భంగమైతే కలిగే శిక్ష ఏమిటంటే ముసలి మొగుడు రావడము, సవతిపోరు ఏర్పడడం, కుంటీగుడ్డీవంటి అవకతవకలు గల పిల్లలు కలగడం ఈ మొదలైనవి. ఏ మహిళకైనను ఇవి దుఃఖ హేతువులు.

పూర్వపు సంఘమునందు స్త్రీ జీవితమును నియమించే మూడు సూత్రములను మనము గుర్తించాలి. స్త్రీకి స్వాతంత్ర్యము పనికిరాదు. (న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి)ఆమెకు ప్రత్యేక ఆర్థిక వ్యవస్థలేదు. ఆమెకు గృహవిద్యయే కాని పైవిద్య అంతగా అవసరముకాదు. ఇది మారుపేరులో

బానిసత్వంకాదా అంటే అవుననీ రెండు విధాలా సమాధానం చెప్ప వచ్చును. ఈనాటి వ్యక్తిస్వాతంత్ర్య దృష్టిలో చూస్తే పూర్వ సంఘ మందు మహిళకు ఇవ్వబడిన స్థానము రెండవరకపు పౌరునిస్థాన మని అంగీకరించాలి. అయితే, ఇరువదవ శతాబ్దం వరకూ ప్రపంచం అంతా అట్లాగే ఉండేది. ఇప్పుడిప్పుడే ఆ స్థితి మారుతూంది. అందుచేత స్త్రీలు చేసే నోములు, వ్రతాలు, నియమాలు అన్నీ ఆమె గృహరాజ్ఞీత్వమునకు దారి తీసేవిగానే ఉంటాయి. స్త్రీలు చేసే కొన్ని వ్రతాలు శ్రావణమాసంలో మంగళగౌరీ వ్రతము, వరలక్ష్మీ వ్రతము. పోలేరమ్మ మొదలగు గ్రామ దేవతల ఆరాధనము. ఉండ్రాళ్ళ తదియ, బతకమ్మ పండుగ, అట్ల తదియు, నాగులచవితి, బొమ్మలనోము, రథసప్తమి మొదలైనవి. పోలే రమ్మను కొలుచుట దేశీయాచారమని వ్యక్తమవుతూనేఉంది. మొక్క మొలిచిన కందదుంపను త్రవ్వితెచ్చి, పసుపు కుంకుమ మొదలైనవి అలంకరించి పూజిస్తారు. కందపిలక వలే సంతానాభివృద్ధి అవుతుందని దీని ఆశయము. ఈ విధంగా ప్రకృతి పదార్థాలను సాంకేతికంగా వాడుకొనడం ఆర్యులలోనూ ఉండేది. మహారాజులైన వారి పట్టాభిషేక మందు 'తెల్లుగడ్డి వాడవలెనని వైదికాచారము. అట్లు వాడినచో ఆ రోజు తెల్లుగడ్డి భూమిలో అల్లుకొని పోయినట్లు, తన ప్రజానీకంలో అల్లుకొనిపోయి సుప్రతిష్ఠితుడు అవుతాడట. పోలేరమ్మను గూర్చిన హాస్యగేయము కలదు. కొంటెవాడైన శ్రీకృష్ణుడు దీనికి నాయకుడు. గోపికలు యశోదమ్మతో ఇట్లా షికాయతు చేస్తారు.

గోపికలు—పోలేరమ్మకు మేము పిండీరుబ్బుకొంటె
బోర్లతోసి పోయె మీ వాడు
అయ్యో, బోర్లతోసిపోయె మీ వాడు
యశోదమ్మ—మావాడు కాదమ్మ, మరియెవ్వరోకాని
మందలో ఉన్నాడు మావాడు
మందలో ఉన్నాడు మావాడు

గోపిక —పోలేరమ్మకు మేము కోక తెచ్చుకుంటె
గోచీ చింపుక పోయె మీ వాడు
అయ్యో, గోచి చింపుకపోయె మీవాడు
యశోద—మావాడు కాదమ్మ మరి యెవ్వరోకాని
మందలో ఉన్నాడు మావాడు
మందలో ఉన్నాడు మావాడు
గోపిక — పోలేరమ్మకు మేము వేట తెచ్చుకుంటె
వాతపెట్టి పోయె మీ వాడు—
ఇట్లా చమత్కార సంభాషణ నడుస్తుంది.

ఉండ్రాళ్ళ తద్ది (తదియ) భాద్రపద బహుళ తదియనాడును. అట్లతద్ది (తదియ) ఆశ్వయుజ బహుళతదియ నాడును, స్త్రీలు పాటించు ఆచారములు. ఈ దినములలో తలయంటి పోసుకొని, గోరంటాకు పెట్టుకొందురు. గోరంటాకు గోళ్ళకు లలిత రాగమును గూర్చు ద్రవ్యము. ఇది మాంగల్య చిహ్నముగా ధరింతురు. అందమును ఇచ్చును. అట్ల తదియనాడు చంద్రునివలె తెల్లనైన అట్లు పోసి శారదచంద్రుని పూజించి నైవేద్యము పెట్టుదుదు. చంద్రదర్శనం చెయ్యకుండా భోజనం చేయకూడదు. సుకుమారియైన రాచవారిఅక్కమ్మ ఆకలికి ఉండలేక చంద్రుడు రాకుండానే అన్నం తిన్న దోషమునకై ఆమెకు ముసలిమొగుడు అంద వికారమైన పిల్లలు సంభవించారని కథ చెప్పకుంటారు. అట్లతదియనాడు తెల్లవార గట్లే పెరుగు అన్నంతిని వెన్నెట్లో ఆడపిల్లలంతా ఆడుకుంటారు. అప్పుడు కాబోలు ఈ పాట పాడుతారు.

ఉట్టి క్రింద ముద్ద—
గూట్లో రూపాయి
నీ మొగుడు సిపాయి

దీపావళినాడు పిల్లల సంరంభముగదా. గోగుచెట్లు తెచ్చి వాటికి చివర గుడ్డలు చుట్టి నూనెలో ముంచి ముట్టించి పిల్లలు చక్రాకారంగా తిప్పుతారు. అప్పుడు పసివారు ఇట్లాపాడుతారు.

దిబ్బా దిబ్బా దివ్వేల పండుగ
మళ్ళీ వచ్చే నాగుల చవితి
ఎప్పుడు తిందును – చలిమిడిముద్ద—

బతకమ్మపండుగ విస్తారంగా తెలంగాణంలో స్త్రీలోకమునందు వాడుకలో ఉంది. ఇది దసరా పండుగతో సరిపడును. భాద్రపద బహుళ అమావాస్య మొదలుకొని ఆశ్వీయుజ శుద్ధనవమిదాకా నడుస్తుంది. ఈ దినములలో స్త్రీలు రకరకాల పూవులను సేకరించి, చిత్రంగా పేరుస్తారు. ఆ పేర్పే బతకమ్మ. ఆ తల్లిని కొల్చుటకై మాపటివేళ స్త్రీ లందరూ సమావేశమై నృత్యంచేస్తూ పాటలు పాడతారు.

"బతకమ్మ ! బతకమ్మ ! ఉయ్యాలో
నీ బిడ్డ పేరేమి – ఉయ్యాలో

ఇద్దరక్కా చెల్లెండ్రమయ్యాలో
ఒక్కటే ఊరిచ్చి రుయ్యాలో
ఒక్కడే మాయన్న ఉయ్యాలో
వచ్చన్న పోడాయె నుయ్యాలో
ఎట్లొత్తు చెల్లెలా ఉయ్యాలో
ఏరు లడ్డా మాయె ఉయ్యాలో"

ఇట్లానడుస్తుంది ఈ గేయము. పదవ రోజున బతకమ్మను చెరువులో వాలారించి చల్దులు తిని ఇంటికి వచ్చేస్తారు. కావున దీనికి చల్దుల బతకమ్మ అనియు పేరు. అంతకుముందు మహాలయపక్షంలో బొడ్డెమ్మ

పండుగ అని కన్నె పిల్లలు చేసుకుంటారు. వాళ్ళూ ఇట్లాగే గొబ్బి తట్టుతూ నృత్యం చేస్తారు.

నాగులచవితి స్త్రీలుమిక్కిలి భక్తిశ్రద్ధలతో పాటిస్తారు. కార్తీక శుద్ధ చవితినాడు ఈ వ్రతము చేస్తారు. ఇంట్లో నాగప్రతిమలు ప్రతిష్ఠించి కాని, పాము పుట్టవద్దకు వెళ్ళి పాలుపోసి కాని నాగేంద్రుని మొక్కుకుంటారు. నాగేంద్రునకు దీపము పనికిరాదు. అందుచేత దీపము పెట్టరు. వేడివస్తువులు పనికిరావు. ఉడికించని ఆహారమే వినియోగింతురు. ప్రధానముగా చలిమిడిచేసి తిందురు. ఇది కడుపు చలవకోసమని స్త్రీల విశ్వాసము. పురుషులు కొన్ని కర్మలలో పితృపితామహ ప్రపితామహులను పేర్కొన్నట్లే నాగేంద్రునికొలిచే సందర్భంలో స్త్రీలు, తాను, అత్త, అత్తగారి అత్త మూడుతరాల స్త్రీలను పేర్కొంటారు. "శేషమ్మ కొలిచిన నాగేంద్రుడా! సీతమ్మ కొల్చిన నాగేంద్రుడా! శ్రీశైల భ్రమరాంబ కొలిచే నాగేంద్రుడా! చీకటా వాకటా మావాళ్ళు నడుస్తూంటారు. తోక తొక్కితే తొలగిపోయి, నడుము తొక్కితే నావాళ్ళనుకొని, పడగతొక్కితే పారిపోయి వాళ్ళని రక్షించు" అని ప్రార్థిస్తారు. ప్రాచీనాంధ్రులు నాగారాధకులు. నాగజాతివారు అనికూడా కొందరు చారిత్రకులు చెప్పుతారు.

పామరజనుల్లో ఉండే మరొక ఆచారం పేర్కొనవచ్చును. దీనిని 'బోనాలు' అంటారు. దీనిని సాధారణంగా శ్రావణమాసంలో చేస్తారు. ఒక ప్రత్యేక దినమనే నియమం లేదు. దీని యుద్దేశము గ్రామదేవతను సంతృప్తి పరచడం, కలరా మున్నగు వ్యాధులువచ్చే కాలం కనుక వాటి నుండి గ్రామ ప్రజలను కాపాడమని గ్రామ దేవతను కొలవడమే 'బోనాలు' అనే ఆచారముయొక్క లక్ష్యము. బోనము అనగా అన్నము వండి, పెరుగు, తీపిపిండివంట (అరిశెలు) చేసి, ఒకగిన్నెను పసుపు

కుంకుమలతో అలంకరించి, బోనమును దానిలో నుంచి గ్రామ దేవతకు సమర్పింతురు. పిదప నైవేద్యమైన బోనమును చాకళ్ళుగాని కుమ్మరులు గాని తీసుకొని వెళ్ళుదురు.

బొమ్మలనోము అనే వ్రతాన్ని కొత్తగా పెళ్ళయిన బాలికలు సమూహంగా ఏర్పడి చేసుకొందురు. దీనిని సంక్రాంతి వెళ్ళిన కనుమునాటి నుండి తొమ్మిది దినములు చేయుదురట. ఇది సావిత్రీ గౌరమ్మపూజకు సంబంధించినది. బాలికలంతా బాజాభజంత్రీలతో కుమ్మరి యింటికివెళ్ళి ధాన్యం మొదలైనవి కట్నంగా ఇచ్చి బొమ్మలు చేయించుకొని తెచ్చుకుంటారు. ఏడు నుండి తొమ్మిది బొమ్మలు చేయించుకుంటారు. అందులో ఒకబొమ్మ పంచాంగ బ్రాహ్మణుడు. దినమున కొక పిండివంట చొప్పున నైవేద్యం పెట్టుతారు. తొమ్మిది దినాలు కొలిచి బొమ్మల్ని ఏటిలోకాని చెరువుకు కాని వొతారిస్తారు. ఈ వ్రతము ఐదువ తనము పెంపొందించుటకు ఉద్దేశింపబడినది. రథసప్తమినాడు స్త్రీలు పాలపొంగలి చేసి సూర్యనారాయణమూర్తిని ఆరాధిస్తారు. సంవత్సరాది లేక ఉగాదికి కొత్తబట్టలు కట్టుట, వేపపూవు మామిడి పిందెలతో గూడిన పచ్చి పులుసు ఆరగించడము - ఇవి సర్వజన విదితములు.

పురుషుల ఆచారములు వైదిక - పౌరాణిక సంప్రదాయములకు దగ్గరగా ఉంటాయి. శ్రీరామనమి, శ్రీకృష్ణాష్టమి, శ్రావణపూర్ణిమ, విఘ్నేశ్వర చవితి, విజయదశమీ యాత్ర, శమీ సందర్శనము, గ్రామము లోని శివకేశవాలయములందలి కల్యాణోత్సవములు, సంక్రాంతి వేడుకలు, బోగిమంటలు, భీష్మైకాదశి, కాముడిపున్నమ, శివరాత్రి జాగరములు వంటివి పేర్కొనవచ్చును. దసరా దినములలో నవరాత్రములు, సరస్వతీ పూజ, రైతులు తమ వృషభములను పశువులను కొమ్ములకు పసుపురాచి అలంకరించుట, దీపావళి సందర్భమున గొల్లలు బఱ్ఱెలకు రంగులు పూసి

వాని నాడించుచు కట్నములు సేకరించుట, అప్పటి వారి జానపద వీర నృత్యములు స్మరింపదగియున్నవి. సంక్రాంతికి కోడి పందెములు, పొట్టేళ్ళ పందెములూ కొన్ని ప్రాంతాల్లో సాగుతాయి. బొమ్మరాటలు, తోలుబొమ్మలాటలు, పగటి భాగవతులు, కల్యాణోత్సవములందు పగ్గములు కట్టి దేవుని రథము లాగుట, దేవుని పల్లకీలు మోయుట వేసవియందు చలి వెందలలు నడుపుట, వెన్నెల కోలాటములు, మొదలైనవి పురుషుల వినోదములు.

భారతీయులందరికిని తీర్థములు, జాతరలు, సంతలు మొదలైనవి ప్రాచీన కాలము నుండియు ప్రీతిదాయకములు. యాదవ వంశ ప్రళయము జాతర సందర్భముననే జరిగినట్లు మహాభారత మౌసల పర్వమునందు కలదు. వీటినే తిరునాళ్ళు అనుటయు కలదు. చిల్లర గ్రామదేవత నుండి ఏడుకొండల స్వామి వరకు ఆరాధనకొరకై సంవత్సరమున ప్రత్యేక సందర్భముల దినములు కలవు. అట్టి పుణ్యదినమునకు దూర దూరము నుండి భక్తులు స్త్రీ పురుషులు బృందములు కట్టివచ్చి దేవునికి మొక్కులు చెల్లించుకొని, తీర్థము చూసి, వలసిన వస్తువులు కొనుక్కొని వెళ్ళి పోవుచుందురు. యాత్ర కెళ్ళి పాత్రతెచ్చుట సామెతయైపోయినది. ఇప్పటివలె పూర్వకాలమున నగరములు అంతగా లేకుండుటచేతను, రకరకములైన సామగ్రులు వలసిన చోట్లలో లభింపకపోవుటచేతను, తీర్థములు వర్తక స్థానములుగా కూడా ఉపయోగించెడివి. ఒక్కొక్కప్పుడీ తీర్థములు అనారోగ్య కేంద్రములుగా పరిణమించేవి. ఆ జనసమూహములందు ఆరోగ్య వ్యవస్థ చేసెడివారు లేకుండిరి. తిరునాళ్ళలో అవినీతి కూడ తాండవించెడిదని శ్రీనాథాదులు వర్ణించిరి. తీర్థముల దోషము లెట్లున్నను అవి మంచి సాంఘిక ప్రయోజనమునే సాధించెడివి. అనేక కళలను, చేతిపనులను ప్రదర్శించుటకు జాతరలు మంచి రంగములుగా ఉపయోగ పడెడివి.

తీర్థము లేని గ్రామమే లేదనుట అతిశయోక్తికాదు. యాత్రీకులు వేల సంఖ్యలలో వెళ్ళే పుణ్యస్థలములు ఆంధ్రదేశంలో అసంఖ్యాకములు గానే ఉన్నవి. తిరుపతి, అన్నవరము, భద్రాద్రి, సింహాద్రి, అంతర్వేది, శ్రీశైలము మహానంది, వంటివి లెక్కలేనన్ని, దేవతాస్థానములును తక్కువ కాదు. బెజవాడ కనకదుర్గ, అనుమకొండ పద్మాక్షి, వానపల్లి పళ్ళాలమ్మ వంటి దేవతలు గొప్ప మహిమకలవారని జనుల విశ్వాసము. కేవల శైవులైనవారు ప్రభల తీర్థము నిర్వహింతురు. మన దేశమునందు పూర్వము జైనమతము బాగుగా వ్యాప్తిలో నుండెడిది. తరువాత శైవము దానిని వెనుకకు నెట్టినది. వీరశైవ విజయమునకు చిహ్నముగా ప్రభల తీర్థము ఏర్పడినదేమోయను సందియము జనించును. తెరచాపలవంటి వస్త్రములతో ప్రభలను నిర్మించి, మోకులపై నెత్తి యూరేగింపు తీసికొని పోవుదురు. అప్పుడు భక్తులు కత్తులు మొదలైన ఆయుధములు దాల్చి వీరత్వ ముట్టిపడునట్లు "అశ్శరభ, శరభ! అల్లల్లభీర! నీగ్రుడ్లు తీయిస్తునా! నీపళ్ళు పీకిస్తునా" అని భీకర నాదములు చేయుచు సాగిపోవుదురు. సాధారణముగా పంచాణమువారును సాలెవారును ఇట్టి వీరభక్తి ప్రదర్శనములు చేయుచుండినట్లు కాన్పించును.

ఇటీవల యాంత్రిక నాగరికత గ్రామసీమలలోనికి కూడ వ్యాపించుటచేతను, రాకపోకల సౌకర్యములు విస్తారముగ అభివృద్ధి చెందుట చేతను, పూర్వాచారములు మోటుగా తోచుటచేతను, సినీమా-రేడియో వంటి ఆధునిక వినోద సాధనములు, విస్తరిల్లుటచేతను జనపదము నందలి ప్రజలుకూడ పెద్దల వేడుకలను విస్మరించి విసర్జించుచున్నారు.

—ఖండవల్లి లక్ష్మీరంజనం

# నిత్య జీవితంలో వేమన

ప్రాచీనాంధ్రకవుల్లో వేమనది ప్రత్యేకమైన గొంతు. ఒకే పోతలో పోసిన ప్రబంధాలు ఉసిళ్ళలాగా ఉత్పన్నమవుతున్న రోజుల్లో నేరుగా ప్రజాజీవితంలో నుంచి వస్తువు నేరుకున్న ప్రజాకవి వేమన. అంతే కాదు. ఆదికవి వాల్మీకి అనుష్టుప్పువంటి చిన్నవృత్తంలో అంతటి మహాగాథను పలికించినట్లు వేమన ఆటవెలదిలాంటి పొట్టిపద్యంలో ఆకాశాన్ని ముట్టే భావాలు ప్రకటించాడు. ఆ మహానుభావుడే అన్నాడు గదా – కొండ అద్దమందు కొంచెమై యుండదా' అని. కొలిస్తే అందని ప్రజాజీవితంలోని విస్తృతినీ, ఉన్నతినీ ఆటవెలదిలోని చిన్న చిన్న పాదాల్లో అందంగా పొదిగాడీతడు. ఆ ఆటవెలదిలోకూడా చివరిపాదంలో విశ్వదాభిరామ వినురవేమ' అనేది విధిగా ఉండేదే. ఇకపోతే మిగిలినవి మూడుపాదాలే. ఈ మూడుపాదాల్లో ముల్లోకాలనూ ముడివేసేంత ఆలోచననూ, అనుభవాన్నీ అందించాడీతడు.

వేమన పదిహేడో శతాబ్దికి చెందినకవి. అంటే ఇప్పటికి మూడు వందల సంవత్సరాల వెనకాల ఉన్నకవి. ఈ మున్నూరేళ్ళనుంచీ వేమన జీవించేవున్నాడు. తాటాకు పుటల్లోనో, రాగిరేకుల్లోనో కాదు. ప్రజల నాల్కలమీద, భావుకుల హృదయఫలకాలమీద.

కర్పూర తాంబూలం నములుతున్నప్పుడు, కన్నీళ్ళు చెక్కిళ్ళ మీద చిందినప్పుడు, ఎవరినైనా ఎగతాళి చేసేటప్పుడు, ఎవరిపట్లనైనా సానుభూతి ప్రకటించేటప్పుడు, నిజం కల్లగా డొల్లినప్పుడు, కల్ల నిజమై

పల్లవించినప్పుడు, ద్వేషం, హాసం, విషం, అమృతంలాంటి విభిన్న లక్షణాలున్న ప్రవృత్తు లెదురైనప్పుడు, సర్వసామాన్యంగా ఏమాత్రం తడివున్న మనస్సులోనైనా తటుక్కున స్ఫురించేది వేమన సృష్టించిన ఆటవెలదే. మన నిత్యజీవితంలో వేమనలాగా కలిసిపోయిన కవిలేడు. అంతేకాదు — మనం నలుగురం కూచొని నవ్వేవేళల్లో వేమనపద్యాలు వింజామరల్లా ఉపకరిస్తాయి. పురుషార్థాల్లోని పొరల్ని విడదీసి చెప్పడానికి, అంతరంగానికీ, బహిరంగానికీ ఉన్న అంతరాలను విప్పి చూపడానికి వేమనపద్యాలు వెలలేని భాష్యాలుగా పనికివస్తాయి.

వేమనపద్యాలకు వస్తువు మనం బ్రతికి బట్టగట్టి తిరుగుతున్న సమాజంలోనే పుష్కలంగావుంది. ఆయనకు ఏ పురాణాల్లోనుంచో ఇతిహాసాల్లోనుంచో వస్తువరణం చేయవలసిన అవసరం లేకపోయింది. అంత మాత్రాన ఆతను పురాణాలనూ, ఇతిహాసాలనూ, అసలే స్పృశించలేదని కాదు. అక్కరగలిగినప్పుడు పౌరాణికాంశాల డొక్క చీల్చకుండా ఉండలే దితడు.

'కులము నీరుచేసి గురులను వధియింప
బొసగ నేనుగనుచు బొంకు బొంకె;
పేరు ధర్మరాజు పెనువేపవిత్తయా'

అని ధర్మరాజు శీలంమీదనే ధ్వజమెత్తాడు. అప్పుడప్పుడు ఇలా అధిక్షేపంనిమిత్తం పురాణ విషయాలను తీసుకున్నా, వేమన గ్రహించిన వస్తువు ప్రధానంగా సాంఘికమే. సాంఘికమంటే మున్నూరేళ్ళ క్రిందటి సమాజానికి సంబంధించికదా ! పాతపడిపోలేదా ? నాటి న్యాయాలు నేడు చెల్లని నాణాలుకావా ? వేమనకు సంబంధించినంతవరకూ ఈ ప్రశ్నలు వట్టి ప్రశ్నలుగానే మిగిలిపోతాయి. వేమన నీతులూ,

సూక్తులూ, దాదాపు అన్నీ ఇరవయ్యో శతాబ్ది సమాజాన్ని అక్షరాలా ప్రతిబింబిస్తాయి. ఆయన తీసుకున్న ఉపమానాలన్నీ ఈనాటికీ వర్తిస్తాయి. ఆయన చేపట్టిన వస్తువు ఈనాడూ సజీవంగా కనిపిస్తుంది. అంటే వేమన తీసుకున్న విషయాలూ, చెప్పినతీరూ, శాశ్వతత్వముద్ర గలవన్నమాట. ఇక మన నిత్యజీవితంలో వేమన పద్యాలు ఇంత సజీవంగా ఉండడానికి కారణమేమిటో చూద్దాం.

లోకంలోని మంచినీ, చెడునూ, ఎత్తునూ, పల్లాన్నీ చెప్పడానికి వేమన తమాషాపద్ధతిని అవలంబించాడు. లోకంలో పరస్పర విరుద్ధ గుణాలు కలిగివున్నా, బయటికంత విభిన్నంగా కనిపించని పదార్థాలు కొన్ని వుంటాయి. ఉప్పును తీసుకున్నాడు, కప్పురాన్ని తీసుకున్నాడు. రెంటిరూపంలో పోలికవుంది. నాల్కమీద వేసిచూస్తే రెంటిరుచీ వేరు. ఇది సత్యం. శాశ్వత సత్యం. ఈ సత్యం వేదాంతానికి సంబంధించింది కాదు. వేదాంతంలో సత్యమంటే పరబ్రహ్మమే. మిగతా అంతా అసత్తు అంటే మిథ్య. వేమన ఇలాంటి సత్యాలజోలికి పోలేదు. అతడు చూసింది లౌకిక సత్యం. ఉప్పు, కర్పూరము ఒకేరకంగా కనిపించడం లౌకిక సత్యం. అలాగే రుచిభేదం కూడా లౌకిక సత్యమే. ఈ సత్యాన్ని తీసుకొని మరో శాశ్వత సత్యాన్ని నిరూపించడానికి ప్రయత్నించాడు. 'పురుషులందు పుణ్యపురుషులు వేరయా' అని నిరూపించడమది. లోకంలో అందరూ మనుషుల్లాగే కనిపిస్తారు. కాని వారిలో కర్పూరగుణమున్న పుణ్యాత్ములు వేరు. పురుషుల్లో పుణ్యపురుషులు వేరు అని బోధచేస్తే జనం వినదు. ఉప్పునకూ, కర్పూరానికీ ఉన్న సామ్యాన్నీ భేదాన్నీ విప్పి చెప్పి, మామూలు మనుషులకూ మానవోత్తములకూ ఉన్న తేడాను నిరూపిస్తే జనం వెంటనే తలూపుతుంది. రెండు పరస్పర భిన్నగుణాలుగల వస్తువుల్ని ఏరి వాటిద్వారా ఒక మహాసత్యాన్ని చెప్పడం వేమన ప్రత్యే

కత. ఈ సూత్రం ఆధారంగానే వేమన రాయీ రత్నం, గంగిగోవూ ఖరమూ, కంచూ కనకం, మానూ మనసూ మొదలైన విభిన్న విషయా లను గ్రహించి, వాటిని విశ్లేషించి, సమన్వయించి, అప్రియమైన సత్యా లనుగూడ హాయిగా అందించాడు. మన ఆరోగ్యం పెంచాడు.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగా రన్నట్లుగా వేమన కవితాశక్తి రెండుప్రక్కలా పదునున్న చురకత్తి లాంటిది. దానిని ప్రయోగించే టప్పుడు అతనికి జంకు గొంకుల్లేవు. లోకం డబ్బుచుట్టూ గిరగిరా తిరుగు తుంది. గుణంతో నిమిత్తంలేకుండా ధనానికి పీటవేస్తుంది. ఈ నగ్న సత్యం అందరెరిగినదే. దాన్నే వేమన ఎంతో పదునుగా ఇలా అధిక్షే పించాడు.

"కులము గలుగువారు గోత్రంబు గలవారు
విద్యచేత విర్రవీగువారు
పసిడిగల్గువాని బానిసకొడుకులు"

అలాగే

"చదువులందు పాడిమొదవులందును స్త్రీల
పెదవులందు రాజ్యపదవులందు
ఆశ లుడిగినట్టి అయ్యలుగల రొకొ"

అని సూటిగా ప్రశ్నించాడు. కాదనడానికి ఎన్ని గుండెలుండాలి. వేమన కాలంలోనే కాదు. ఈ కాలంలోనూ వాటిమీద ఆశలుడిగిన వాళ్ళెవరు? ముఖ్యంగా 'రాజ్యపదవులందు' ఆశలు రోజురోజుకీ ముదిరి పోతున్న విషయం మనం నిత్యం గమనిస్తున్నదే.

వేమనకు విగ్రహారాధనమన్నా, అడవుల్లో తపస్సు చేయడమన్నా, మతంపేరిట వేషాలు వేయడమన్నా గిట్టదు. అసలు వాటిమీద ఈయనకు

ప్రత్యయమే లేదు. అందువల్ల వాటిని తలచుకున్నప్పుడల్లా పరిహాసం స్ఫురిస్తుంది. ఏ కొండగుహల్లోనో తపస్సుచేసి మోక్షసిద్ధి పొందడం ఈయన దృష్టికి హాస్యాస్పదంగా కనిపించింది. అందుకే ఇలాఅంటాడు :

'గుహలలోనజొచ్చి గురువుల వెదకంగ
క్రూరమృగ మొకండు తారసిలిన
ముక్తిమార్గ మదియె ముందుగా జూపురా.'

గ్రాసవాసోదైన్యాన్ని పొంది గుహల్లో తపఃక్లేశం అనుభవించే యోగుల్ని ఒక్క త్రోపుతో త్రోసివేశాడు. వాళ్ళను ఏ మృగమో పొట్టబెట్టుకుని ముక్తిని ప్రసాదిస్తుందట.

వేమన విజ్ఞానం పుస్తకాలమీద ఆధారపడిందికాదు. లోకమే అతని పుస్తకం. లోకంలోని వివిధ సంఘటనలనూ, ప్రవృత్తులనూ సమీకరించి నిలిచిపోయింది. దానికి ఉపమానంగా పొట్లకాయను తీసుకోవడంలో వేమన నిత్యజీవితంలోని వివిధాంగాలను ఎంత నిశితంగా పరిశీలించాడో తెలుస్తుంది.

ఈ భావాన్నే—

'మ్రాను దిద్దవచ్చు మరి వంక లేకుండ
దిద్దవచ్చు రాయి తిన్నగాను
మనసు దిద్దరాదు మహిమీద నెవరికి,

అనే పద్యంలోనూ బలపరిచాడు. నిత్యజీవితంలో సర్వసామాన్యంగా కనిపించే వస్తువుల్ని తీసికొని వాటినుంచి నీతిని పిండుకోవడంలో వేమన విశిష్టత యేమిటో పైన వివరించబడింది.

సామాన్య విషయాల్లోనుంచి తాత్వికమైన పారలౌకికమైన అభిప్రాయాలను తరచి తీయడంలోనూ వేమన అంతటి సమర్థుడే.

(8)

'ఆకు వక్క సున్నమవి మూడు వన్నెలు
ఏకమైన చోట తాకు నెరుపు
సోకి త్రిగుణమట్లు శోభించు పరమాత్మ.'

తాంబూలాన్ని తీసుకున్నాడు వేమన, తాంబూలంలో ముఖ్య పదార్థాలు మూడు. ఆకు, వక్క, సున్నం. వీటి వన్నెలు వేరు. ఈ మూడు వన్నెలు మేళనం పొందినప్పుడు ఒక కొత్తవన్నె-ఎరుపువన్నె-పుడుతుంది. తాంబూలరాగం అందరూ ఎరిగిందే. ఈ మామూలు సత్యాన్ని గ్రహించి వేమన చాలా ఎత్తు ఎగిరాడు. పారలౌకిక ప్రపంచం లోకి వెళ్ళిపోయాడు. మానవుని మనస్సు త్రిగుణాత్మకం. సృష్టి త్రిగుణ హేతుకం. త్రిగుణ సమ్మేళనం పరమాత్మ దీప్తికి దారితీస్తుంది. ఇంతటి తాత్త్విక విషయం చెప్పడానికి వేమన తీసుకున్న తాంబూలోపమానం ఆశ్చర్యం కలిగిస్తుంది. మనం పూర్తిగా విస్మరించిన, గుర్తించక విసర్జించినా అతడు నీతిని బోధించాడు. జారకాంతా సాంగత్యాన్ని నిరసించ డానికి ఇతడు తీసుకున్న ఉపమానం చూడండి.

'ఇంటియాలి విడిచి యిల జారకాంతల
వెంట దిరుగువాడు వెర్రివాడు
పంటచేను విడిచి పరిగ యేరినయట్లు.'

పరిగ అనేది వ్యవసాయసంబంధమైన పదం. ఎదిగిన పంటను కోసుకున్న తర్వాత అక్కడక్కడా రాలిపడివున్న గింజల్నిగానీ, మిగిలిపోయిన పంట మొక్కల్నిగానీ పరిగ అంటారు. పంట చేనుండగా దాన్ని విడిచి పరిగ ఏరుకోవడం ఎంత అవివేకమో, ఇల్లాలిని విడిచి వెలయాలి వెంటపడడం అంతే అని వేమన అందించిన వెచ్చనినీతి. ఈ నీతిని ప్రబోధించడానికి పంటచేనునూ, పరిగనూ ఉపమానాలుగా తీసు

కోవడం అతని పరిశీలనశక్తికి నిదర్శనం. అలాగే మరోచోట ఇలా అంటాడు :

'పొట్లకాయ రాయి పొదిగి త్రాటనుగట్టి
లీల తోడ వంకలేక పెరుగు
కుక్కతోకగట్ట చక్కగా వచ్చునా.'

పొట్లకాయకు వంకరగా ఎదిగే గుణముంది. అందువల్ల దానికి వంకర లేకుండా చేయడానికి రాయి వేలాడగడుతారు. అది క్రమంగా చక్కగా ఎదుగుతుంది. మరి కుక్కతోకకు ఇలా చేసినా చక్కగా అవుతుందా అని వేమన ప్రశ్న. కాదని సమాధానం. 'కుక్కతోకంటే మూర్ఖుని చిత్తమన్నమాట. సూటిగా మూర్ఖుని చిత్తమనక కుక్కతోకను సంకేతంగా తీసుకోవడంలో ఉద్దేశమేమిటి? కుక్కతోక చక్కగారాదనే విషయం సుప్రసిద్ధం. ఆసలు కుక్కతోక వంకర అనే విషయం మూర్ఖుని వక్రబుద్ధికి పర్యాయంగా లోకంలో తలచిన సామాన్య విషయాలను పరిశీలించి వాటిద్వారా పరతత్వ నిర్దేశం చేయడం మాటలా? అలాంటి గారడీ వేమన్నకు వెన్నతోపెట్టిన విద్య. అందుకే వేమన మన నిత్యజీవితానికి అంత సన్నిహితుడైనాడు. ఎక్కడో ఒకచోట, ఎప్పుడో ఒకప్పుడు ఆయన్ని స్మరించకుండా ఉండలేము. ఆంధ్రజాతి ఊపిరిలో ఊపిరిగా కలిసిపోయాడతడు. అందుకే అతణ్ణి మన వేమన అనాలనిపిస్తుంది.

—డా. సి. నారాయణరెడ్డి

# దాసరిపాట

## 1

అతడు తెలగదాసరి. అతనినివాసస్థలము తెలుగుదేశము. అతని పరివారము, చుట్టములు, అతనిభార్య. అతని ఆస్తి ఒక తాంబ్రా, ఒక గుమిసీ, ఒక జత అంజెలులు.

అతని దృష్టి యెప్పుడూ పదములలో దాగియున్న తెలుగు వీరుల మీదనే. అతని ఆశయము యెప్పుడూ తెలుగు దేహములను పదములు పాడి పులక లెత్తించడమే.

అతడు చూడని తెలుగుగ్రామములేదు. అతడు మెట్టని తెలుగు దేశములేదు. అతని పాటలు వినని తెలుగువారులేరు—కొందరు నవనాగరీకులుతప్ప.

మరాటీ మనుష్యులవలె యెఱ్ఱని పెద్ద తలపాగా పెట్టుకొని చిరిగిపోయిన పాతకోటు వేసుకొని పాత జరీకండువా వల్లెవాటుగా ధరించి పంచె యెగగట్టి బుజముమీది తాంబ్రా వేళ్ళతో మీటుతూ మెళ్ళో పూసలు కదిలేటట్టు చిందులు తొక్కుతూ అతడు మరాటీకథపదము చెప్పేటప్పుడు వీరరసము ఉట్టిపడేది. అతని బొమముడికి పెట్టుకున్ననామము పెచ్చులు పెచ్చులుగా ఊడిపోయేది. బొటనవేలుకీ తర్జనికీ తగిలించుకొన్న అంజెళ్ళు ఖంగున మోగేవి. పక్కనే కూర్చున్న అతనిభార్య గుమిసిమీద మోకాలు పెట్టి భర్త ముఖముమీదనే వీక్షణములుంచి గుమిసి వాయించునపుడు భర్త చెప్పు పదమునకు మరింత గాంభీర్యము వచ్చేది. జనులు ముగ్ధులై పోయేవారు.

అతనికి యిరవయ్యోయేట పెళ్ళైనది. పెళ్ళైనటి మొదలు నేటి వరకూ అతనిభార్య అతనివద్దనే ఉన్నది. పెండ్లినాటి కామెకు పద్ధాలుగో యేడు. ఆమె తండ్రికూడా ఒక తెలగవాసరే. కాని అతడు అకాల మృత్యువువాత పడుటచేత ఆమె తల్లివద్దనేఉండి చాలా దరిద్ర మనుభ వించింది. కాని కొన్నిపదములు నేర్చుకొంది. తల్లి దగ్గిరనున్న కాలములో ఆమెకు తల్లే సర్వమున్నూ. పెళ్ళిచేసుకున్నతర్వాత ఆమెకుభర్తేసర్వమూ. భర్త దగ్గిర ఆమె గుమిసివాయించడం నేర్చుకుంది. భర్తదగ్గిర ఆమె క్షేత్రపదము లనేకములు నేర్చుకొన్నది. భర్త పాడేటప్పుడు అతని పాటకు తాను ఊతపదమును కలిపేది. వారిహృదయాలకు అద్వితీయస్థితి లేనట్టే వారి పాటకుకూడా లేదు.

పదములోని వీరరసమును భర్త వెలువరించే టప్పుడు ఆమె హృదయము వీరరసముతో ఉప్పొంగేది.

కరుణారసము తనపదమునకు భర్త ఒప్పించేటప్పుడు కళ్ళవెంబడి వచ్చిన కన్నీళ్ళు గుమిసినితడిపేవి. 'తందాన తాన' అనే ఊతపదము గద్గదమయ్యేది.

భర్త చమత్కారము చూచి చిరునవ్వు నవ్వినప్పుడు ఆమె గుమిసి దెబ్బలలో నవ్వు వినిపించేది.

కొంటెతనముతో అతడు మీసముమీద చెయ్యివేసి నాయికా నాయ కుల శృంగారమును వర్ణించేటప్పుడు ఆమె తలవంచి గుమిసి తప్పు వాయించేది.

భేదములేనివారి ప్రేమకు, కౌటిల్యమెరుగనివారి ప్రేమకు, దేహ ములు వేరైనను వారి ఆత్మలను ఒక్కటిగ చేసినవారి ప్రేమకు ఫల ముగా వారికి ఒక కొడుకుపుట్టాడు. వానికి ఇప్పుడు ఐదోయేడు.

## 2

చదువుకున్నవాడంటే ఎవడు? వ్రాలుచేయగలవాడేనా? వ్రాలు చేయలేని భట్రాజులు, దాసరులు, జంగములు, సాతానులు, వీధి భాగవతులు-వీరిమాటేమిటి? భారతభాగవతములను, మహావీరుల దేశీయ కథలను ఇతరులకు బోధించగల వీరు చేవ్రాలు చేయలేనివారనే కారణము చేత చదువురానివారని త్రోసివేయవచ్చునా? దేశములో కొందరు విద్యలను పోషించవలెను. కొందరు వృత్తులను పోషించవలెను. వృత్తులను పోషించేవారికి చదువులలో నిగ్గు తెలియాలి. దానికోసము సంఘములో కొందరు ఏర్పాటుకావాలి. భట్రాజులు, దాసరులు మున్నగువారు ఇట్టివారు. వీరు సర్వసౌఖ్యములను పరిత్యజించి భిక్షుకవృత్తి అవలంబించేరు పూర్వము. ముఖ్యముగా మతప్రచారముకొరకై వారూరూరు తిరుగుతూ భిక్షుకులై దేశములోని అజ్ఞానమును ఒకవిధముగా పోగొట్టుచున్నారు. వీరిని చూచి నేటివారు 'కూలిపని చేసుకోకూడదా?' అనడం ఆచారమైనది. వంశపారంపర్యంగా వస్తూన్న ఆచారాలని ఒక్కమారు వదలిపెట్టడం కష్టం. అయినా వారికి భైక్ష్యవృత్తి నీచముకాదు. వారి దేవుడే ఒక భిక్షకుడు కాబట్టి.

ఈకాలపు ముద్రాశాలలకన్న వీరే సంఘమునకు ఎక్కువ ఉపయోగకరంగా ఉండేవారు. అచ్చుయంత్రము చదువువచ్చినవారికే, వీరు అందరికీ ఉపకారము చేస్తున్నారు.

మనదాసరి చాలాపాటలు పాడగలడు. బొబ్బిలికథ, తిమ్మరాజుకథ, కోడిపుంజులకథ, సర్వాయపాపడుకథ, కామమ్మకథ, కాంభోజరాజుకథ, చెంచుకథ మొదలైన కథ లనేకములు రసవత్తరముగా వినిపించగలడు. ఈ పదములన్నీ ఇతని భార్యకుకూడా వచ్చును. వీరి

అయిదేండ్ల కొడుకుకు అప్పుడే అయిదారుకథలు ఒకమోస్తరుగా పాడ డము వచ్చును,

ఇంతవరకు వీరిని భగవంతుడు ఆదరముతోనే చూచేడు. ఎక్క డికి వెళ్ళినా వీరికి కడుపునిండా తిండిదొరికేది. తగిన బహుమానము దొరికేది. ఈ దాసరిదంపతులకు మొదట ఒకరిమీద ఒకరికి ఎంత అను రాగముండేదో వారి పాటలమీదకూడా వారికి అంత అనురాగమే ఉండేది. ఇప్పుడు వారిద్దరూ వారిపాటలకన్న వారికొడుకుని ఎక్కువ అనురాగ ముతో చూచుకొంటున్నారు. కొడుకును ఒకరువిడిచి ఒకరు ఎత్తుకొనేవారే గాని నడిపించేవారుగారు. తమకు ఒకముద్ద తక్కువచేసుకునైనా తమ కొడుకుకడుపు నిండించేవారు. అసాధ్యమైన కోరికలు చెల్లించి ఆపూటకి ఉపవాసము చేయడముకూడా అప్పుడప్పుడు కద్దు.

౩

ఒకనాడు ఒక గ్రామములో దాసరిదంపతులు కోడి పుంజులకథ చెప్పుచున్నారు. దాసరి కూర్చుని ఉన్నాడు. అతని ప్రక్కనే అతని భార్య వాద్యము వాయించుచున్నది. ఆమెఒడిలో వారిపుత్రుడు పడు కున్నాడు. దాసరి చూపులు అతనిమీదనే తరచుగాపడుచున్నవి. ఆమె పిల్లవాణ్ణి ఉండుండి అక్కునచేర్చుకొనుచూ ఊతపదము పలకడం మరిచిపోయేది. కోడిపుంజులయుద్ధము వర్ణించేటప్పుడు చూపే ఉత్సా హము దాసరి ఆరోజున చూపలేకపోయేడు. రాజపుత్రుల పౌరుషవాక్య ములు ఆనాడు నీరసములైనవి. ప్రజలందరు అతనిపాటనువిని పెదవి విరుచుకొన్నారు. కొందరు ముసిలివాడైనాడితడు. 'ఇక పదములు చెప్పలే' డన్నారు. గర్వము బలిసినదన్నారు మరికొందరు ఇతన్ని చూచి.

ఆరోజున వారికి రావలసినంత ఆదాయము రాలేదు.

ఆరోజుకు సరిపడేటంత ఆదాయమైనా రాలేదు.

రాత్రి మూడుగంటలైనది. కథముగిసినది. ప్రజలందరు ఇండ్లకు వెళ్ళిరి. దాసరి తనకొడుకు ఒంటిమీద చెయ్యివేసిచూచేడు. ఒళ్ళు కాలిపోతూంది. దాసరిభార్య తనకొడుకు కాలికి వున్న కట్టువిప్పినది దాసరి ఏదో పసరుముద్ద కాలిమీది గాయముమీద వేసినాడు. ఆమె మళ్ళీ కట్టు కట్టినది. దాసరి తనతలపాగా మెత్తగా వుండేటందుకు పక్కవేసేడు. దానిమీద తన కోటుపరిచేడు. దాసరిభార్య తనకొంగు ఆ ప్రక్కమీద వేసి దానిమీద బాలుని పడుకోబెట్టి అతనిపక్కనే తాను పడుకొన్నది. ఈవలిపక్క దాసరి రాళ్ళమీద పడుకున్నాడు. తూర్పున ఉదయించిన చంద్రవంక మేలుకొనియున్న దంపతుల కన్నీటి బిందువులలో ప్రకాశించింది. ఊరుబయట చెట్టుక్రింద పడుక్కొనివున్న దాసరి కుటుంబమునకు మరునాడు పాటపాడితేనేకాని పొట్టనిండదు.

## 4

రాత్రి యెనిమిదిగంటలైంది. రెండు కిర్సనాలుదీపాలు ఊరిచివర చెట్టుక్రింద వెలుగుచున్నవి. చుట్టూప్రజలు కూర్చుని ఉన్నారు. దాసరి ఒకబుజముమీద తాంబ్రా మీటుతున్నాడు. బొబ్బిలికథ చెప్పుతున్నాడు. కూర్చునే చెప్పుతున్నాడు. యథాప్రకారము అతనిభార్య అతని ప్రక్కనే కూర్చున్నది. బుజముమీది వారికొడుకు చిక్కి శల్యమైయున్నాడు. కాలిమీది కట్టు మరింత పెద్దదిగాఉన్నది. ఉండుండి అతడు తలయెత్తి తండ్రికేసీ, తల్లికేసీ చూచి మళ్ళీ బుజముమీద తలవాల్చి కూర్కుచున్నాడు. ఆ రోజున జ్వరము తగ్గినదని తండ్రికి బెంగగావుంది. బొబ్బిలి కథ క్రమక్రమముగా రక్తికట్టుచున్నదని ప్రజలనుకొనుచున్నారు. బొబ్బిలికోట

ముట్టడించడానికి సైన్యములు పూనుకొనుచున్నవి. యుద్ధమును వర్ణించి దాసరి ప్రజల మెప్పును పొందేడు. రంగారావు వీరకృత్యములు ప్రజలలో ఆవేశమును కలిగించినవి. తాంబ్రాతీగెలు కదిలిపోవుచున్నవి. గుమిసి ఖంగుమనుచున్నది. దాసరి యెలుగెత్తి రంగరాయమరణమును విలపించాడు. ప్రజలకు కళ్ళనీళ్ళు గిర్రునతిరిగినవి. తల్లి బుజముమీదనున్న కొడుకు ఒంటిమీద చెయ్యివేసి చూచినది. ఒళ్ళు చల్లబడుచున్నది. దాసరి ముఖముకేసి చూచినది. అతడు విజయరామరాజు క్రౌర్యమును వర్ణిస్తున్నాడు. కొడుకు హీనమైన స్వరముతో 'అయ్యా' అన్నాడు. ఒక చేతితో సానురాగముగా కొడుకును నిమిరి అతడు కథ సాగించాడు.

తాండ్ర పాపయ్యకు బొబ్బిలివీరుల మరణవార్త తెలిసినది. రౌద్రాకారుడై వచ్చి అతడు విజయరామరాజును చంపిన వార్త దాసరి పాడి ప్రజలకు తెలియజెప్పాడు. ప్రజలు తలవూపినారు. కాని అనుకొన్నంత రసవంతముగ పాపయ్య శౌర్యమును వర్ణించలేకపోయినా దేమిచెప్మా అనుకొన్నారు ప్రజలు.

తల్లి తనకొడుకువంటిమీద మళ్ళీచెయ్యివేసి చూచినది. దాసరి తాంబ్రా కిందపెట్టి రెండుచేతులతోను కొడుకు నెత్తుకొని రెండో భుజము మీద వేసుకొన్నాడు. వేసుకొని బిక్కమొగముతో భార్యవంక తిరిగి చూచేడు.

పాపయ్య బంధువులమరణమునకై ఎన్నడూ ఎప్పుడూ విలపించనట్లు ఆరోజున విలపించేడు. దాసరి పాడిన పాట ఇంత కరుణామయముగా ఎప్పుడూలేదని అనుకొన్నారు ప్రజలు. పాపయ్యతోపాటు దాసరితోపాటు ప్రజలుకూడా కన్నీళ్ళువిడిచి విలపించారు.

ఆనా డాదాసరి ఆలపించినవిలాపగీతికకు దాసరి హృదయతం త్రులే తంబురాతీగలై శ్రుతికలిపినవి.

ఆనాడాదాసరి ఆలపించిన విలాపగీతికకు ఆ తల్లి తన హృదయము మీద చేతులతో గుమిసివాయించింది. ౧౯—౨౭

—చింతా దీక్షితులు